

50

# సృజన

8 వ జన్మదిన సంచిక

నవంబర్ రష్యన్ విప్లవానికి అంకితం

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

**50**

8 వ జన్మదిన సంచిక

నవంబర్ రష్యన్ విప్లవానికి అంకితం

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

84 పేజీలు 1 రు.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

1973 నవంబర్ — మాసపత్రిక — 50



SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited and Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J. P. N. Road, Warangal-506002 (A. P.)

## సృజన గురించి నాలుగు మాటలు

ఇది సృజన 8 వ జన్మదిన సంచిక.

వరవరరావుగారు జైల్లో వున్న సంగతి మీ అందరకూ తెలుసు.

వరవరరావుగారి అరెస్టుతో పత్రిక ఆగదన్న విప్లవాభిమానుల, విప్లవరచయితల సంకల్పమే సృజనను కొనసాగిస్తుంది. ఈ కొనసాగింపుకు పాఠకుల అభిమానుల రచయితల సలహా సహకారాలు సదా వుంటయ్యని ఆశించుతున్నాను. వారులేని కొరజ్ఞాన అనుభవ లేమిచే యీ సంచికలో పొరబాట్లు తప్పులు చాలా వచ్చివుండవచ్చు మన్నించి సవరణలో తోడ్పడగలరని కోరుతున్నాను.

విప్లవోద్యమం ఎన్ని కష్టాలనయినా అధిగమిస్తూ ఎలా అయితే అంతిమ విజయం పొందితీరుతుందో రచయితల విడుదలకై సాగుతున్న వుద్యమమూ ప్రజోద్యమమై జయించితీరుతుందని ఆశించుతున్నాను. ఈ ఉద్యమాన్ని నిర్వహించటమూ, యిందు కోసం విరాళాలకై విరసం విజ్ఞప్తి జయప్రదం చేయటంలో ప్రజలు, పాఠకులు శ్రద్ధ వహించుతారని ఆశించుతున్నాను.

ఈ సంచికను నవంబర్ రష్యన్ విప్లవానికి అంకితం చేయటం వరవరరావుగారి వుద్దేశం. ఈ సందర్భంలో లెనిన్‌ని అధ్యయనం చేయటానికి ప్రారంభంగా యీ క్రింది స్టాలిన్ మాటలను జ్ఞప్తి చేసుకుందాం.

"లెనిన్‌ను గుర్తుంచుకోండి. ప్రేమించండి. అధ్యయనం చేయండి— ఆయన మన గురువు, నాయకుడు.

లెనిన్ మనకు బోధించినట్లుగా— ఇంటా బయటావున్న శత్రువులతో పోరాడండి.. విశ్లేషం చేయండి.

లెనిన్ మనకు బోధించినట్లుగా— కొత్త సమాజాన్ని, కొత్త జీవన విధానాన్ని, కొత్త సంస్కృతిని నిర్మించండి.

చిన్నపనులు చేయడానికైనా నిరాకరించకండి. చిన్నపనులనుంచే కొత్త విషయాలు నిర్మాణమవుతాయి. ఇది లెనిన్ చెప్పిన ప్రధానవిషయాల్లో ఒకటి."

— సంపాదకురాలు

# TO JUNGAL SANTHAL

OUT
With a thousand TNT blast
You've erupted out

Out at last
On the edge of the
eastern woods
Waving red with rage
Arrow - speaking

A million eyes on your body
Grown, through the
barrel of a gun
Breathing fire you've sprung
Out of the bleak crevice
of the past
History's fertile womb's open,
inviting
Its centuries wet with orgasms

Leap out !
Leap out fast ! !
Snath the present
And
Resurrect future

*M. T. Khan*

# జంగల్ సంతాల్ కి

అనువాదం: నిఖిలేశ్వర్

హఠాత్తుగా పేలి
వెయ్యి టిఎన్‌టిల శక్తితో
నువ్వు బలంగా పేలి
చివరికి
తూర్పు అడవుల మూలల్లోంచి
మాట్లాడుతున్న బాణంగా
ఎర్రగా, ఉద్రేకంతో ఊగుతూ...

నీ శరీరంపై కోటికళ్లు
తుపాకి గొట్టంలోంచి మొలిచి
మంటలు ఎగజిమ్ముతూ
గతం దోపిడి గుయ్యారంలోంచి
నువ్వు మహావేగంతో దూకుతూ...
సారవంతమైన చరిత్రగర్భకుహరంలో
ద్రవిస్తున్న శతాబ్దాలను ఆహ్వానిస్తూ
ముందుకు దూకు

ఇంకా బలంతో దూకు
వర్తమానాన్ని పెరికి
విప్లవ భవిష్యత్తును స్థాపించు

[జంగల్ సంథాల్
నక్సల్బరీ రైతాంగ పోరాటాన్ని
నడిపించిన గిరిజన వీరుడు.]

## ఏలినవారికి భయం ఎప్పుడు పుట్టింది — శ్రీపతి

సూర్యుడు ఉదయించాడో లేదోనని దీపం తెచ్చి చూసిందట ఓ అవ్వ మీసాల అవ్వ. అట్లుంది ఈ ప్రభుత్వం తెలివి. ప్రజల చైతన్య అరుణోదయాన్ని రాజ్యాంగం గుడ్డి దీపం తెచ్చి గుడ్డికళ్ళతో చూస్తున్నది మీసాల అవ్వ.

భూస్వాముల ఏజెంట్‌గా, సామ్రాజ్యవాదుల కీలుబొమ్మగా, ప్రగతి నిరోధకుల వారసురాలుగా, దోపిడీవర్గాల కాపలా కుక్కగా ప్రభుత్వం- ప్రజాతంత్ర స్వాతంత్ర్యాన్ని జైల్లో బంధించి ఉంచి కాలరాచేయాలనుకుంటే ఆ కుట్రను బయటపెట్టడం ప్రజాపక్షం వహించే మేధావులకు తప్పనిసరి విద్యుక్తధర్మం. ఆ పని విప్లవ రచయితల సంఘం సగర్వంగా బాహాటంగా నిర్ద్వంద్వంగాచేస్తుంది. అందుకే ప్రభుత్వానికి విప్లవ రచయితల ఉపన్యాసాలంటే భయం. ఆపనిచేయటంలో రచన విరసం సాధనం. రచనా స్వాతంత్ర్యంమీద ఎంత నిరంకుశ దాడిజరిగినా అంత మనోబలంతో రచయితలు దాన్ని ఎదుర్కొంటారు. ప్రగతినించి, అభ్యుదయంనించి, మార్క్సిజమ్ లెనినిజమ్ మావో ఆలోచనాధారనించి, ప్రజల్నించి, విప్లవాలనించి, ఆచరణనించి, చరిత్రనించి ఎల్లప్పుడూ పాఠాలు నేర్చుకుంటాం. సమాజ శ్రేయస్సుకోసం మా రచనలు విశాల ప్రపంచంలో ప్రజలముందు పెట్టి వారి విమర్శనలను, వారి అవగాహనలను ఆహ్వానిస్తాం. మా తప్పులను సరిదిద్దుకుంటాం. ఆచరణ- విమర్శ- ఆత్మవిమర్శ మా అధ్యయనం.

కాని దోపిడీ ధర్మపన్నులనించి, దోపిడీ నీతిన్యాయాలనించి కాదు నేర్చుకొనేది. విప్లవ సుదీర్ఘ యాత్రలో అపార త్యాగాలుచేసిన, అసువులర్పించిన, కష్టాలపాలయిన- శిక్షలకు, మానభంగాలకు చిత్రహింసలకు బలయిన అమాయకులను, వీరులను, నాయకులను, ప్రజాపక్షంలో ఉన్న అందర్నీ కీర్తిస్తాం. నివాళులర్పిస్తాం. విప్లవ జోహార్లు చెప్పుతాం. వారి దేశభక్తిని గొంతెత్తి పాడుతాం.

ఎర్రగా సూర్యుడు లాగ విప్లవ రచయితల సంఘం పుట్టినప్పుడే ప్రభుత్వానికి నల్లగా కుట్రకళ్ళతో భయం పుట్టింది.

ఆరోజునించి ఆరంభం. విప్లవ రచయితలమీదికి దాడి ఎరుపురంగూ, సుత్తీ కొడవలీ ఎక్కడ సంఘటితంగా కనిపించి శ్రామిక శ్రేయోరాజ్యాలకోసం గొంతు విప్పినా, ప్రజాస్వామ్యం వేదికెక్కి స్వాతంత్ర్య ఎక్కడ సినాదాలు యిచ్చినా అక్కడికి ఎర్రటోపీలు జైళ్ళను మోసుకుంటూ వెళ్లాయి.

దోపిడీ సంకెళ్ళలో, బానిసత్వం జైళ్ళలో మగ్గిపోతున్న విప్లవశక్తులను విముక్తి చేయటానికి కెరటాలు కెరటాలుగా స్వాతంత్ర్యం జనసముద్రం ఉప్పొంగి నప్పుడు ఈ దోపిడి ప్రభుత్వాల జైలుద్వారాలు, గోడలు బద్దలవుతాయి. నేల కూలుతాయి.

దోపిడీ వర్గాలు తాము చేసిన ఘోరాలకు నేరాలకు తగినశాస్తి పొందుతాయి.

ఎర్ర జెండా ప్రపంచాన్ని ఏలుతుంది. మా విప్లవం జయిస్తుంది. సామ్యవాద సమైక్య భారతం వర్ధిల్లుతుంది!

# విప్లవమే ఎందుకు గెలుస్తుది?

ప్రజలే ఎందుకు గెలుస్తారు ? విప్లవమే ఎందుకు విజయవంతమవుతుంది ? అనే ప్రశ్నకు ప్రజలు అత్యధిక సంఖ్యలో వున్నారుగనుక, వాళ్ళు విప్లవాలను కోరుకుంటారుకనుక ఎక్కువ, మిక్కిలి ఎక్కువ సంఖ్యలో వున్నవారి కోరిక నెరవేరుతుంది, అన్నది— ఎంత మామూలుగా కనిపిస్తుందో అంత తిరుగులేని నిజం కూడ. అయితే కోరికలు గుర్రాలుకావు. కోరికలు చేతలు, చేతలు, చైతన్యం, పోరాటం దశలను పొందాలి. దోపిడీ దొరలను తొక్కిపారేయాలన్న కోపం, దీపం నుంచీ దీపం వెలిగినట్లుగా ఒకరినుంచి ఒకరికి వ్యాపించి క్రియారూపం పొందేదాకా గుణాత్మకమైన మార్పుకు లోనుకావాలి. దుర్మార్గులను నరికి పోగులేయాలని నెత్తురు కళ్ళచూడాలని— ఇట్లా ఎందరో ఆవేశపడడం చూస్తాం. ఇవి వ్యక్తిగత కారణాలనుంచి వచ్చినా వాటికి వేర్లు సమాజంలో వున్నాయి. అందుకే మళ్ళీ అవి సమిష్టి ఆవేశంగా, ఆచరణగా మారిననాడు కోర్కెలు గుర్రాలవుతాయి.

భారత దేశంలోని ప్రజలందరు ఈ దేశంలో మౌలికమైనమార్పును మొత్తంగా తేగలిగినంత శక్తిని కలిగి వున్నారు— 1917 కు ముందు రష్యన్లవలె, 49 కి ముందు చైనీయులవలె, చాంగ్ కై షేక్, ఆయన పాశ్చాత్య వత్తాసుదారులకున్న శక్తి నిజమయిందికాదు, పైకి కనిపించేది మాత్రమే (More apparent than real) అని మూడు దశాబ్దాలకు పూర్వం మా సియాంగ్ చెప్పింది యీనాడు ఇందిరాగాంధికి, ఆమెకు వత్తాసునిస్తున్న కోకా కోలా, వోడ్కా సామ్రాజ్యవాదాలకు అక్షరంగా సరిపోతాయి. వాళ్ళకు డబ్బు వున్నది, వనరులున్నాయి, ఆయుధాలున్నాయి. వీటి సాయంతో ఓట్లుకూడ గెల్చుకుంటారు. కాని ప్రజల హృదయాలను వాళ్ళు ఎన్నడూ గెల్చుకోలేరు. దీర్ఘకాలంలో 'ప్రజలు నిర్ణాయకపాత్ర వహిస్తారు, ఆయుధాలుకావు. ప్రజలు బాంబును నాశనం చేస్తారు. బాంబు ప్రజలను నాశనం చేయజాలదు—' అన్నాడు మావో. ఈ వ్యూహాత్మకమైనభావమే 'సామ్రాజ్యవాదం, ఇంకా యితర అభివృద్ధి నిరోధక శక్తులన్న కాగితం పులులు'అనే ఒక్క నిర్వచనంగా రూపొందింది. 1946 ఆగస్టులో మావో చెప్పిన యీ మాట 'సామ్రాజ్యవాదం మట్టికాళ్ళ కలోసస్'* అని

* కలోసస్ ఒక గ్రీక్ పురాణ పాత్ర. చాల బలవంతుడైన గ్రీక్ వీరుడు. సముద్రాలమీద నిలిచిన పెద్ద ఆకారం.

ఎన్నడో లెనిన్ చెప్పిన మాటను వివరించి చెప్పిందే. లెనిన్... విప్లవ నాయకత్వం వహించిన నాటికి, రష్యాప్రజలు విప్లవాన్ని నిర్వహిస్తున్న నాటికి సామ్రాజ్యవాదం అభివృద్ధిచెందుతున్న దశలోవున్నది. పెట్టుబడిదారీ విధానం అత్యున్నతదశగా సామ్రాజ్యవాదం పుంజుకున్న దశ. మనిషి మనిషిగా కాక కలోసస్‌వంటి గ్రిక్ వీరునంత ఉన్నతంగా, భయంకరంగా కనిపిస్తూ, అంగలూ చాస్తే సముద్రాలు దాటి భూమిని వామనునివలె ఆక్రమించినదశ. ఆ దశలోకూడ అంత పెద్దరూపం తన కాళ్ళమీద తాను నిలవలేదని, అంటే తన శక్తిమీదకాక కార్మికశక్తిమీద నిలిచిందని గుర్తించాడు కాబట్టే లెనిన్ వాని కాళ్ళు మట్టికాళ్ళన్నాడు. ఈనాడు సామ్రాజ్యవాదం ప్రపంచవ్యాప్తంగా పతనమయ్యేదశలో వున్నది. ఆనాడు ఎక్కడో బలహీనమైన గొలుసును తెంచాల్సిన అవసరాన్ని, చోటును, లెనిన్ అంత ప్రజ్ఞాశాలి, మట్టి కాళ్ళ వేళ్ళసందున బలంగా సుత్తె దెబ్బలతో కొట్టి నిరూపించాడు. ఈనాడది కలోసస్ వలె కూడ లేదు. అంటే పురాణపాత్రగానైనా మనిషిపోలికలు కూడ లేవు. స్పష్టంగా దౌర్జన్యానికి ప్రతీక అయిన, రక్తదాహానికి ప్రతీక అయిన, క్రూరస్వభావానికి ప్రతీక అయిన పులిరూపాన్ని తీసుకున్నది. పులి ఎంత క్రూరమయిందయినా, పులి అంటే మనిషికి భయమెన్నిపాళ్ళో,. చంపాలన్న కోరిక, అవసరమూ, నిర్ణయమూకూడ అన్నిపాళ్ళ. ఎట్లా చంపాలి, ఎప్పుడు చంపాలి, ఎక్కడ మాటుకాసి వేటాడాలి అన్నవే సమస్యలు. నిజమైన పులికే చావు తప్పదు— ఇంక కాగితంపులి గతేమిటి!— ఇట్లా ఆలోచిస్తే చాల తేలికగా కొట్టిపారెయ్యాల్సిన విషయంకాదిది. విప్లవాలు గెలువాల్సివుంటే గెలుస్తాయికదా— పులి చావాల్సివుంటే చస్తుందికదా— అని విషయాలను కాలంమీదికినెట్టే బాధ్యతా రహితుడు కమ్యూనిస్టుకాడు. సామ్రాజ్యవాదం, ఇతర అభివృద్ధి నిరోధకశక్తులు కాగితంపులులు అని మావో ఏ అర్థంలో అన్నాడంటే, చైతన్య ప్రేరణతో ఉవ్వెత్తున లేచిన ప్రజలచేతుల్లో వాళ్ళు ఓడిపోతారు— అనే అర్థంలో. అదే సమయంలో వాళ్ళు నిజమైన పులులు కూడ— ఎంతో నష్టాన్ని ఎన్నో దుర్భరమైన గాయాలను చేయగల క్రౌర్యం, సామర్థ్యం వారికున్నది. ఆ విషయం ప్రపంచవ్యాప్తంగా నిత్యం అనుభవంలో చూస్తూనేవున్నాం. అది పంజా ఎత్తి కొట్టినపుడు దాని ప్రత్యక్షహింసలో (యుద్ధం) బాధనెంత రుచి చూస్తున్నామో అది తిన్నది నెమరేసుకుంటూ నెత్తుటి నాలుకతో మీసాలను నాకుతూ అర్ధనిమీలిత నేత్రాలతో శాంతిదృక్కులు ప్రసరిస్తున్నపుడు (రెండింటికీ ఉదాహరణకూడ యిటీవలి మధ్య ప్రాచ్యదేశాల్లో చూస్తాం) కూడ దాని కడుపులో జీర్ణమైపోతున్న ప్రజాశరీర అవశేష

భాగాలుగా అంత బాధలను అనుభవిస్తున్నం. యుద్ధము-శాంతి దాని ఆకలి, నిద్రిలు తినబడుతున్నం. జీర్ణమవుతున్నం అందుకే భారతప్రిజలు, చైనా ప్రిజలవలెనే, మావో చెప్పినట్లుగా వ్యూహాత్మకంగా శత్రివును తేలికగా తీసుకోవాలి, ఎత్తుగడలరీత్యా మాత్రిం, అతని ఉనికిని మొత్తంగా పరిగణనలోకి తీసుకోవాలి. (People should slight the enemy strategically, but take full cognizance of him tact fully) ఒక చెంపన ప్రిజలు తమను తాము రక్షించుకోవడానికి సాహసించాలి. పోరాడడానికి సాహసించాలి. విజయం కోసం సాహసించాలి. మరోచెంపన పోరాటాన్ని మనం చాలా సీరియస్‌గా తీసుకోవాలి. ప్రితి ప్రిచారానికి ప్రితి పోరాటానికి పూర్తి శ్రిద్ధను ధారపోయాలి. తోడువచ్చే శక్తులనన్నిటిని వెతికి తీసుకోవాలి. ప్రపంచ వ్యాప్తంగా వున్న ప్రిజలనుంచి ఎంత సహకారం వస్తే అంత క్రోడీకరించుకోవాలి. పోరాటం వద్దనేది మితవాద అవకాశవాదానికి దాసోహమనడం. మొట్ట మొదటి, అన్నిటికన్నా ముఖ్యమైందీ పోరాడాలనే నిర్ణయం, పోరాడే సాహసం, విజయాన్ని సాధించే సాహసం— ఇవి రష్యన్ ప్రజలకు యీ శతాబ్ది మొదటి రెండు దశాబ్దాలలో ఎంత సత్యమో, (మళ్ళీ యీనాడుకూడా ఎట్లా గ్రిహించాల్సి ఉన్నదో) చైనా ప్రిజలకు 49కి పూర్వం, మళ్ళీ 66 లో ఎట్లా ఆచరణలోకి, అనుభవంలోకి వచ్చాయో అంతకన్నా నగ్నంగా, స్పష్టంగా ప్రపంచ ప్రిజలకు యీనాడు ప్రిత్యేకంగా భారత ప్రజలకు అంత అవసరం. 'దేశాలు స్వాతంత్రి్యాన్ని కోరుతున్నాయి. జాతులు స్వేచ్ఛను కోరుతున్నాయి. ప్రిజలు విప్లవాన్ని కోరుతున్నారు.' విప్లవాన్ని కోరుతున్న ప్రిజలు విప్లవ చైతన్యంతో సాయుధులైనపుడు 'చాల మంది నెత్తురు తాగిన పులి కూలిపోతుంది.'

ఉప్పెనలా వస్తోంది విప్లవం
ఆహ్వానించు.
అడుగు వెనక్కు వేశామంటే క్షమించవు చరిత్రిపుటలు
సమరం యిది పద ముందుకు
నిజం ఎన్నుకొని, మన పక్షం తెలుసుకొని
విజయం లభించేదాకా పోరాడుదాం.

# విప్లవ రచయితల సంఘం సాహిత్య పాఠశాల

## సభలు - సాంస్కృతిక కార్యక్రమాలు (6, 7-10-73)

వరంగల్, అక్టోబర్ 13 : అక్టోబర్ 4 న ప్రారంభమైన విరసం సాహిత్యపాఠశాల కార్యక్రమం అక్టోబర్ 7 న బహిరంగసభ, సాంస్కృతిక కార్యక్రమాలతో ముగిసింది. అన్నిటికీ పతాకస్థాయిగా 7 వ తేదీ సాయంత్రం విరసం కమ్యూన్ (కాలెజ్ ఆఫ్ ఎడ్యుకేషన్ హాస్టల్, హనుమకొండ) నుండి జగదీశ్‌నగర్ (నర్సంపేట రోడ్, వరంగల్)దాకా ఆరుమైళ్ళ పొడవునా దాదాపు రెండువేల మందితో ఊరేగింపు సాగింది. ఊరేగింపుకు శ్రీశ్రీ నాయకత్వంవహించాడు.

ప్రభుత్వం, పాలకవర్గాలు అడుగడుగునా కల్పించిన అవరోధాలు అధిగమించి 'సాహిత్య పాఠశాల' జయప్రదంగా జరిగింది. పాఠశాల తరగతులు నిర్వహించుకోవడానికి మొదట అనుమతించబడిన కాలెజ్ ఆఫ్ ఎడ్యుకేషన్ అనుమతి 3 వ తేదీ సా॥ విరమించుకున్నారు కాలెజ్ అధికారులు. చేసేదిలేక బుద్ధభవన్‌కోసం 4వ తేది ఉదయం ప్రయత్నిస్తే కుమార్‌పల్లికౌన్సిలర్ మార్క్సిస్టుపార్టీ పట్టణ కార్యదర్శి మొదట యివ్వడానికి అంగీకరించాడు. ఒక గంట తిరుగకపూర్వమే కమిటీ కూర్చొని యివ్వొద్దని నిర్ణయించిందని వార్త పంపాడు. బుద్ధభవన్ మార్క్సిస్టుపార్టీ సొంతఆస్తి కాదు. అది వరంగల్ ప్రజలది. కాని అది భగవాన్‌దాస్‌గారి పాకెట్ భవనంలా ఆ పార్టీ కార్యక్రమాలకు మాత్రమే ఉపయోగపడుతున్నది. చివరకు రచయితలు సాహిత్య పాఠశాల జరుపుకోవడానికికూడ అది దొరుకలేదు. పాఠశాల కమ్యూన్ కొరకు తీసుకున్న హాస్టల్‌లోనే 200 మందికిపైగా వచ్చిన డెలిగేట్లకు తరగతులు నడపాల్సివచ్చింది.

విరసం సభ్యుడు, విప్లవకథకుడు ఎన్. ఎస్. ప్రకాశరావు స్మృతిచిహ్నంగా ఏర్పాటుచేసిన హాల్‌లో మధ్యాహ్నం(4వ తేదీ) 1 గం॥కు అంతర్జాతీయగీతంతో పాఠశాల ప్రారంభమయింది. మొదట సాయంత్రం 7 గం॥ల దాకా 'గతితార్కిక భౌతిక వాదం'మీద క్లాస్ జరిగింది. ఇంతవరకు ప్రపంచాన్ని నిర్వచించిన మేధావులు, తత్వవేత్తలే వచ్చారుకాని, ప్రపంచచరిత్రగమనాన్ని మార్చిన రెవల్యూషనరీ మార్క్స్ అని చెప్తూ, ఛైర్మన్ మావో 'వైరుధ్యాలు' గతితార్కిక భౌతికవాదానికి తాత్త్విక మెరుగులని కె.వి. సుబ్బారావుగారన్నారు. మార్క్సిజం ఆచరణ శాస్త్రమని యివ్వాళ అది మావో ఆలోచనావిధానంగా యీ యుగలక్షణాన్ని నిర్దేశిస్తున్నదని చెప్పారు.

5 వ తేదీ ఉదయం 'జ్ఞానసిద్ధాంతం'కూడ కె.వి. సుబ్బారావుగారే వివరించారు. సైన్స్‌ను, ప్రకృతిని, సమాజాన్ని గతితార్కికసూత్రాలతో నిర్వచిస్తూ సమన్వయిస్తూ జ్ఞానంకూడ సమాజంనుంచే వస్తుందని 'సరియైనభావాలు యెక్కడినుంచి వస్తాయి' 'మేధావి అంటే ఎవరు' (ఈ రెండు ఛైర్మన్ మావో వ్యాసాలు సమయానికి కరపత్రాల

రూపంలోవచ్చాయి)అనే వ్యాసాల్లోని భావాలను వివరించారు. ఈ సందర్భంలోనే సందర్భవశాత్తు ప్రస్తావించబడిన రష్యన్ సోషల్ సామ్రాజ్యవాదం గురించి శ్రోతలు వివరంగా వినగోరితే గంగిరెడ్డిగారు కాశీపతిగారు వివరించారు. మాటల్లో సోషలిజం, చేతల్లో ఇంపీరియలిజాన్ని సోషల్ ఇంపీరియలిజమ్ అంటారని లెనిన్‌చెప్పిన మాటలను సోదాహరణంగా వివరించి అన్వయించారు.

సామ్రాజ్యవాదం పులిఅయితే, సోషల్ సామ్రాజ్యవాదం మేకవన్నెపులి అని, ఇది ఎక్కువ నష్టంచేస్తుందని పలుపుర చర్చల్లో తేల్చారు.

5వ తేదీ మధ్యాహ్నం చారిత్రిక భౌతికవాదాన్ని చలసాని ప్రసాద్ చాల సులువైన మాటల్లో చాల తేటతెల్లంగా, సమేతలతో వివరించాడు. అదే సాయంత్రం కమ్యూనిస్టు మ్యానిఫెస్టోపై ఐ. వి. సాంబశివరావు ప్రసంగించాడు. అదేరాత్రి కార్యవర్గ సమావేశం జరిగింది.

6వ తేదీ ఉదయం 'రాజ్యాంగ యంత్రం– విప్లవం' గురించి కె. వి. రమణారెడ్డిగారు చాల వివరంగా మాట్లాడారు. ఆ మధ్యాహ్నం విరసం సర్వసభ్య సమావేశం ఏర్పాటు చేసినందున పాఠశాల కార్యక్రమం జరుగలేదు 7వ తేదీ ఉదయం 'అదనపు విలువ'పై కాశీపతిగారు మాట్లాడారు. తిరిగి ఆ మధ్యాహ్నం సర్వసభ్య సమావేశం జరిగినందున క్లాసు జరుగలేదు. 'సాహిత్య పాఠశాల'గురించి అనుకున్న అంశాల్లో మార్క్సిజం– లెనినిజం; మార్క్సిజం– లెనినిజం– మావో ఆలోచనా విధానంపై క్లాసులు జరుగలేదు కాని సుబ్బారావుగారు చాల విస్తృతంగా మావో ఆలోచనా విధానాన్ని తడివి యీనాటి చైనా విప్లవ నాయకత్వంగురించి వివరించారు అలాగే కె. వి. రమణారెడ్డిగారు, కె వి. సుబ్బారావుగారి క్లాసుల్లో లెనినిజం వివరించబడ్డది. అయితే యీనాటి భారత దేశ పరిస్థితులకు అన్వయించి చెప్పలేదన్న అసంతృప్తి కొందరుసభ్యులు వ్యక్తంచేసారు. భారత దేశ పరిస్థితులకు అన్వయించి చెప్పే కార్యక్రమం ప్రొద్దుటూరు సభలకు వున్నదని, వ్యాఖ్యానంలేకుండా మౌలిక సూత్రాలు చెప్పడమే యీ పాఠశాల పరిధి, లక్ష్యమని కొందరు బాధ్యులు వివరించారు. ఆ మేరకు పాఠశాల ఉపయోగపడ్డట్లే ఎంతోమంది విద్యార్థులు ఎంతో శ్రద్ధగా నోట్స్ తీసుకొని, ప్రశ్నలువేసి, క్లాసుల తర్వాతకూడ చర్చల్లో పాల్గొని తమ జిజ్ఞాసను, శ్రద్ధాసక్తులను ప్రదర్శించారు. 200 మందికిపైగా పాల్గొన్న డెలిగేట్లలో 30 మందికిపైగా స్త్రీలు, 100 మందికిపైగా విద్యార్థులు 30 మందిదాకా కార్మిక చైతన్యంవుండి, విద్యలేని యువకులు వుండడం విశేషం. బొబ్బిలి మొదలుకొని నిజామాబాదుదాకా, మద్రాసు మొదలుకొని ఆదిలాబాదుదాకా విస్తరించిన ప్రాంతాలనుంచి డెలిగేట్లు వచ్చారు. నాలుగురోజులు వీరందరికీ విరసం కమ్యూన్‌లోనే భోజన, వసతులు ఏర్పాటు చేయబడినవి. 6వ తేదీ సాయంత్రం విరసం కార్యదర్శి త్రిపురనేని మధుసూదన్‌రావుగారి ఆధ్వర్యంలో విరసంసభ్యుడు తాతా హనుమంతరావు ఆదర్శ వివాహం జరిగింది. విప్లవ పాటలతో కమ్యూన్ మార్మోగింది.

పాఠశాల వాతావరణం నిజంగా కమ్యూన్ వాతావరణాన్ని తలపించేలా వున్నది. ముందర విప్లవం వర్ధిల్లాలి, విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి అనే సైన్‌బోర్డులతో ప్రవేశం. లోన ఎదురుగా అమరవీరుడు కామ్రేడ్ జగదీశ్ ఫోటో. విజయానికి ఐక్యతకు చిహ్నంగా జరిగిన జనచైనా పార్టీ 10వ మహాసభలకు, చైర్మన్ మావోకు జేజేలు చెప్పే పోస్టర్లు. ఎస్. ఎస్. ప్రకాశరావు హాల్‌లో అమరవీరులు సుబ్బారావు పాణిగ్రాహి, బత్తుల వెంకటేశ్వరరావు, డాక్టర్ చాగంటి భాస్కరరావు, కొల్లిపర నరసింహారావు, రాజారాంరెడ్డి, బాల్‌రెడ్డి ఫోటోలు— యింకా ఎన్నో విప్లవ నినాదాలు, పోస్టర్లు. కమ్యూన్ ఎంట్రెన్స్ దగ్గరే విరివిగా అమ్మబడ్డ విప్లవ సాహిత్యం. ఈ సాహిత్య పాఠశాల సందర్భంగా వచ్చిన కొత్త పుస్తకాలు, సాహిత్యం లెక్కగట్టడానికి కూడ చాలదు. మావో రచనలు— 1. సరియైన భావాలు ఎక్కడి నుంచి వస్తాయి. 2. మేధావి అంటే ఎవరు ? 3. ఉదారవాదాన్ని ప్రతిఘటించండి.

లెనిన్-గెరిల్లా యుద్ధతంత్రం, ప్యారిస్ కమ్యూన్ చారిత్రక పాఠాలు పేర్కొనదగినవి. మావో యేనాన్ ప్రసంగం, కళలు-సాహిత్యం ఎవరికోసం— కుటుంబరావుగారి అనువాదం విరసం ప్రచురించింది. ప్రజాకళాకారుడు గద్దర్ పాటలను సృజన ప్రచురించింది. సోషలిస్ట్ పబ్లికేషన్స్ 'నక్సల్‌బరీ' అనే కొత్త కవితా సంకలనాన్ని, చారుమజుందార్ పంథాను వివరించే వ్యాసాలు, జ్వాలాముఖి 'రేపటికవిత్వం' వ్యాసంపై విమర్శను ప్రచురించింది. ఇంకా యిలాంటివి ఎన్నో పుస్తకాలు, కరపత్రాలు వెలువడినవి. చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక చౌ ఎన్ లై, వాంగ్ ప్రసంగాలు శ్రామికవర్గ ప్రచురణలద్వారా వచ్చింది. కొత్తగా వరంగల్ నుంచి ప్రారంభమైన రాజకీయ పక్షపత్రిక 'విమోచన' పాఠశాల సమయానికి సరిగా అందింది. ఇవిగాక పిలుపు, సృజన అక్టోబర్ సంచికలు, జనశక్తి ప్రచురణలు జీవనాడి కూడ వచ్చినవి. ఇన్ని పుస్తకాలు పత్రికలు రావడం ఒక ఎత్తు— వీటిని పాఠశాలలో 6, 7 తేదీ సభల్లో అమ్మడం ఒక ఎత్తుగా జరిగింది. స్త్రీలు, పిల్లలు జట్లుజట్లుగా ఏర్పడి సభ అంతా తిరుగుతూ వీటిని అమ్మారు— ఇది ఒక మంచి అనుభవం.

6వ తేదీ సాయంత్రం హనుమకొండ జీవన్‌లాల్ గ్రౌండ్స్‌లో శ్రీశ్రీ అధ్యక్షతన కవిసమ్మేళనం జరిగింది. వేదికమీద విరసం చిహ్నం సుత్తి-కొడవలి-కలం, మార్క్స్-ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావో పెద్దపెద్ద చిత్రాలు ఎంతో దూరందాకా కాంతివంతంగా ప్రకాశించినవి. ఆరోజు దసరా. తెలంగాణలో దసరా పండుగకు, ఆయుధపూజ, జమ్మిపూజలకు అన్నిపండుగలకన్న చాల ఎక్కువ ప్రాముఖ్యత యిస్తారు. అయినా కవిసమ్మేళనానికి రెండువేలకుపైగా జనం రావడం చాల విశేషం. కవిసమ్మేళనంలో నలభైమందిదాకా కవులు పాల్గొన్నరు. విరసం కవులుకాక కాళోజీ, సుధాకర్ మున్నగువారు పాల్గొన్నారు. తర్వాత జననాట్య మండలి వారి సాంస్కృతిక కార్యక్రమాలు జనాన్ని విప్లవావేశంతో ఉర్రూతలూపినవి. కవాలి, కిసాన్ నృత్యం, డప్పుపాట, రైతుకూలీ విజయం బుర్రకథ యింకా ప్రజల గుండెల్లో స్పందిస్తున్నవి.

7 వ తేదీ సాయంత్రం కమ్యూన్‌నుంచి శ్రీశ్రీనాయకత్వంలో బయల్దేరిన ఊరేగింపు జగదీశ్‌నగర్ చేరుకునేవరకు హనుమంతునితోకలా పెరిగిపోయింది. మార్క్సిస్ట్ మహోపాధ్యాయుల చిత్రాలు (పైన పేర్కొన్నవి) హోచిమిన్, చారుమజుందార్, పంచాది కృష్ణమూర్తి, బత్తుల వెంకటేశ్వరరావు, జగదీశ్, కొల్లిపర నరసింహరావు వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం మున్నగువారి చిత్రాలు, విప్లవ నినాదాలతో వెల్లివిరిసిన ప్లేకార్డ్స్, విప్లవం వర్థిల్లాలి, విరసం వర్ధిల్లాలి, ప్రజను సాయుధం చేస్తున్న రెవల్యూషనరీ నేడు కవి అని పెద్ద అక్షరాలతో రాసిన బ్యానర్లు— సాయుధ పోరాట నినాదాలతో— శ్రీ శ్రీ బహిరంగసభలో చెప్పినట్లుగా— ఆరుమైళ్ళ నడిచిన ఆ ఊరేగింపు ఒక మినీ లాంగ్‌మార్చ్— రేపు ఢిల్లీదాకా సాగనున్న లాంగ్‌మార్చ్ లక్షణాలు యిందులో ఉన్నాయని శ్రీశ్రీ అన్నారు. 7 వ తేదీ సాయంత్రం ఆకాశం యీ విప్లవ కంఠాల నినాదాలతో ఎరుపెక్కింది. హనుమకొండ వరంగల్ నగరాలలో ప్రజలు ఆరుమైళ్ళ పొడవునా బారులుతీరి వేలసంఖ్యలో యీ ఊరేగింపు ఉజ్వలత్వాన్ని గుండెల్లో పదిలపరుచుకున్నారు. యువకులు విద్యార్థులు ఎక్కడికక్కడ ఉండబట్టలేక ఊరేగింపులో చేరిపోయారు. పేద పోలీసులనుకూడ ఊరేగింపు సాంస్కృతిక కార్యక్రమాలు మైమరపించినవని కదిలించినవని జనం చెప్పుకున్నారు. జగదీశ్ నగర్‌లో పదివేలమందికిపైగ హాజరయిన సభలో శ్రీశ్రీ, కె.వి. రమణారెడ్డి, త్రిపురనేని మధుసూదనరావు, ఎం. టి. ఖాన్, పతిపాటి వెంకటేశ్వర్లు, జ్వాలాముఖి, కాశీపతి, వరవరరావు ప్రసంగించారు. ఈ దోపిడీ ప్రభుత్వ స్వభావంగురించి, కల్లబొల్లి సోషలిస్టు కబుర్లగురించి, వామపక్ష పార్టీల విద్రోహం గురించి, 46 తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం గురించి, నక్సల్‌బరీ, శ్రీకాకుళం, వీరతెలంగాణ రైతాంగపోరాటాలగురించి వక్తలు వివరించారు. విప్లవకారులపట్ల విప్లవ సాహిత్యం పట్ల, విప్లవ కవులపట్ల ప్రభుత్వం అనుసరిస్తున్న పాశవికమైన దమనకాండ గురించి వివరించారు. దేశంలో ప్రజలు అనుభవిస్తున్న దుర్భర పరిస్థితుల గురించి వివరిస్తూ సాయుధపోరాటమొక్కటే విముక్తిమార్గమని మావో ఆలోచనవెలుగులో జనతాప్రజాతంత్రాన్ని స్థాపించడమే ధ్యేయంగా రాజకీయ, సాంస్కృతికరంగాల్లో పోరాటం సాగించాలని వివరించారు.

వీరకుంకుమ, బీదలపాట్లు నాటికలు జననాట్యమండలివారు ప్రదర్శించారు. బీదలపాట్లు నాటిక 'ప్రజానాట్యమండలి'ని కూడ మరిపించిందని అనుభవజ్ఞులైన కళాకారులు, కార్యకర్తలుకూడ చెప్పుకున్నారు. కవాలి, డప్పునృత్యం, కిసాన్‌డ్యాన్స్, యింకా ఎన్నోపాటలు, పిట్టలదొర, చెరబండరాజు పోలీసుపాట— ఈనాటి సాంస్కృతిక ప్రదర్శనలు.

నినాదాలు యిచ్చి, సభ ముగిసిందన్నా జనం కదలలేదు. రాత్రి రెండుగంటల శరద్రుతు వెన్నెలలో జగదీశ్‌నగర్ వరంగల్ నగరానికి ఒక కొత్త వెలుగును, విప్లవ వెల్లువను, బలాన్ని, ప్రాణాన్ని, దీక్షను కొనితెచ్చింది.




(గత సంచిక తరువాయి)

## 10

యువాన్ మావో గ్రామస్తులు చావో ఇంట్లో సమావేశమై ఓ రైతు సంఘాన్ని ఏర్పరిచేరు. కూలీలు, పేదరైతులు అందరూకలిసి ఓ ముప్పైమందిదాకా అందులో చేరేరు. చావో చైర్మన్‌గానూ, కార్యనిర్వాహక సంఘం పెద్దగానూ ఎన్నికయేడు; కువో వైస్-చైర్మన్‌గాను, పంపిణీసంఘం పెద్దగానూ ఎన్నికయేడు; పాయి సాయుధ దళంలోనూ, ద్రోహుల్ని ఏరేసే సంఘంలో పెద్దగానూ ఎన్నికయేడు: లియూ-తె-షాన్ ఉత్పత్తి సంఘం పెద్దగా ఎన్నికయేడు.

సభ్యులందర్నీ రెండు గ్రూపులుగాచేసేరు. ఒకదానికి ఓల్డ్‌సన్, మరోదానికి తీన్‌తాత పెద్దలు.

గ్రూపు లీడర్లూ, ముఖ్యమైన సభ్యులూ వీలైనంతమందితో పరిచయం పెంచుకోవాలనీ, భావాలు కలిసేవాళ్ళని సభ్యులుగా చేర్చాలనీ తీర్మానించేరు. మూడురోజుల్లో చాలామంది కొత్తవాళ్ళతో పరిచయం పెంచుకున్నారు— వయసు మళ్ళినవాళ్ళు తమ వయసువాళ్ళతోను, యువకులు యువకులతోనూను. ఓల్డ్‌సన్ గ్రూపులో కొత్తసభ్యులు అయిదుగురు బండివాళ్ళే.

"ఒకజాతి పిట్టలన్నీ ఒక్కచోటికే చేరతాయి" అన్నాడు సియావో నవ్వుతూ. "ఏంవోయ్ ఓల్డ్‌సన్, ఈ సంస్థకి నువ్వు పెద్దవైతే యిదొక బండివాళ్ళసంఘం అయేలా వుందే!"

"అదేటిబాబు అలాగంతావ్? నువ్వేకాదా అన్నావ్ 'మీతో కలిసొచ్చేవోల్లని కలుపుకోండీ'అని? నాతో కలిసొచ్చేవోల్లు మరెవలు, నాలాటి బండోల్లేగదా?" అంటూ వివరించేడు ఓల్డ్‌సన్.

సియావో మిగిలిన సంఘాల పెద్దలతోకలిసి గ్రూపుల్ని మళ్ళీ మార్చడానికి నిశ్చయించేడు. పనికిరాని గ్రూపులీడర్లని మార్చేరు. కువో, పాయి గ్రూపులీడర్లయేరు. యువకులు, ఎంతో సమర్థులు అవటంవల్ల ఆ గ్రామానికి వీళ్ళిద్దరు ఎంతో కళ తెచ్చినట్టయింది.

పాయికంటే నాలుగేళ్ళు చిన్నవాడే అయినా కువోనే పెద్దవాడిలా కనిపిస్తాడు. కువో రైతు సంఘానికి వైస్ చైర్మన్అయేక చిన్నవాంగ్ మళ్ళీ తన నివాసం స్వూఉకి మార్చేసేడు. వెళ్ళేముందు, వీళ్లైనంతమంది పేదజనాన్ని కూడగట్టమని చెప్పి మరీ వెళ్ళేడు.

కువో యాంగ్ ఫూ-యాన్ అనే అతన్నికలిసేడు. అతను ఆర్నెల్లు హాన్‌వద్ద కంబారిగా పనిచేసేడు. కాని యిప్పుడు అతుకులగుడ్డలు అమ్ముతున్నాడు. కుర్రాడయినా అతనిలో రెండు లోటులున్నాయి. ఒకటి- పిరికితనం, రెండోది- చిన్న చిన్న సరదాలకే లొంగిపోవడం.

యాంగ్ ఓసారి కువోని రహస్యంగాఅడిగేడు "దలపోల్లు* యింక వుంటారా?"అని

"ఉండరని ఎవరు చెప్పేరేటి?"

"ఎవరూ సెప్పలా. నానూరికే అనుకున్నా"అంటూ తప్పించుకున్నాడు యాంగ్. నిజానికి అతనికి ఆ సంగతి పొడుగుమెడ హాన్ చెప్పేడు.

"చూడు యాంగ్, మనం నిలబడేదీ, లేనిదీ మనమీదేవుంది. మన చైర్మన్ చావో ఏటిసెప్పేడు? 'మన్నూ మన్నూ కలిస్తే పెద్దగోడవుతాది, పేదోల్లూ, పేదోల్లూ కలిస్తే పెద్దపెద్ద రాజ్జాలు కూల్తాయి' మనవంతా ఒకటైతే మనకేటిబయ్యం? దలపోల్లు వుంటారో లేదోనన్న బెంగే అక్కర్లా" అన్నాడు కువో.

"నిజవేఁ"నన్నాడు యాంగ్. కాని పూర్తిగా ఒప్పుకోలేకపోయేడు.

"సరే, పేదోల్లని బాగా కూడగట్టాల"అని సలహాయిచ్చి వెళ్ళిపోయేడు కువో.

కువోకి వైస్ చైర్మన్ అవడంతో తీరికేలేకుండాపోయింది. రోజంతా ఎవరో ఒకరికి ఏదో ఒకవిషయం వివరిస్తూనే వుండేవాడు. తనకేమన్నా అనుమానాలుంటే అవి చిన్నవాంగ్‌నో, సియావోనో అడిగి చెప్పించుకునేవాడు.

ఈ ప్రపంచంలో రెండేరెండు జాతులున్నాయనీ; ఒకటి- లేనివాళ్ళూ, రెండు- వున్నవాళ్ళూ ననీ; లేనివాళ్ళు లేనివాళ్ళుగా మిగిలిపోకుండా తమంత తాము నించోవా

* 8 th Route Army

లంటే కామందుల్ని కప్పెట్టెయ్యాలనీ కువో జనానికి చెప్పేవాడు. ఇది అందరికీ తెలిసిందే అయినా, 'కువో చెప్పేడు' అనేసరికి బాగా హత్తుకుపోయేది.

కువోని అందరూ ఒకేలాగా చూసేవారుకాదు.

"తమ్ముడూ, దలపోల్లు మనని యిడిసిపోరు. సరే. మరి ఈ కార్యకర్తల మాటేటంటావ్?"అని ఆడిగేడో పేదరైతు, స్నేహభావంతో.

"ఈల్లుకూడా మన్ని యిడిసిపోరు"అని నమ్మకంగా చెప్పేడు కువో.

"ఇయాల అంతా మనసేతుల్లోనేవుందికదా! ఎంతమారిపోనాది కాలం! తమ్ముడూ, నువ్వేదంటే దానికి మాం(వూ సైయే" అన్నారు కూలీలు.

"మనందరం ఒకలకోసం అందరూ, అందరకోసం ఒకడన్నట్టుండాలి అని చిన్నవాంగ్ అనలా?"అని గుర్తుచేశాడు కువో. అతనికి చాలా ఆనందంగావుంది. తనకి పేదప్రజల అండవుంది.

కాని అతను కోపతాపాలకీ, ఈర్ష్యకీకూడా గురయ్యేడు. కొందరు కాకారాయుళ్లుకూడా చేరేరు. వాళ్లు అతన్ని 'వైస్‌చైర్మన్'బదులు 'చైర్మన్'అని పిలిచేవారు.

"చైర్మన్ కువో చైర్మన్ చావోని మించినోడు. కువో, మాయింటికోసారి రావోయ్"ఇలా సాగేవి కాకారాయుళ్ళ మాటలు.

ఇక కుళ్లుకునేవాళ్ళ సంగతి— "ఎలాగేనా కువో చైర్మన్ అయినాక కళ్లుకసింత నెత్తిమీదికి పోనాయి. ఇప్పుడు మనవేటి కనిపిస్తావేటి? నాల్రోజులుపోతే నిచ్చెన్లేసినా అందుకోలేం(వు."

"ఎవరెక్కడవుండాలో అక్కడ వుండాలిగానీ కుక్కని తీసుకెళ్ళి సిం(వ్వాసన వెక్కిస్తే ఏటౌతాది?"అన్నాడో కామందు

"వాడికి కాలం మూడిందిలే. ఇప్పుడేదో ఎగురుతున్నాడుగానీ, కొమింటాంగు ప్రభుత్వం మళ్ళీరాగానే ఇలాంటివాళ్ళనందరినీ, తరిమి తరిమి పట్టుకుంటారు"అన్నారు ఒకప్పుడు కీలుబొమ్మ ప్రభుత్వంలో విర్రవీగిన ప్రబుద్ధులు.

కువో ఎవరేమిటంటున్నారో గమనిస్తూనే వున్నాడు. అక్కడే పుట్టి పెరిగిన వాడికి ఎవరు ఎలాంటివారో తెలియకపోదు.

భూసంస్కరణ కార్యకర్తలకి వూళ్ళో సంగతులు వివరిస్తూ, వాళ్ళదగ్గర కొత్త విషయాలూ, కొత్త పదజాలం నేర్చుకునేవాడు కువో జనానికి అంత చేరువవటానికి చాలా కారణాలున్నాయి— అతను జనాన్ని ఒప్పించగల్గటంవల్ల, చిన్నవాంగ్ కొన్నాళ్ళ

అతనింట్లో వుండటంవల్ల, అతనిప్పుడు వైస్‌ఛైర్మన్ అవటంవల్ల. వర్షంకురిసినరోజు అతనిగది జనంతో నిండిపోయేది. వయసుమళ్ళిన ఆడవాళ్ళూ, పసిబిడ్డల తల్లులుకూడ కబుర్లు తెల్సుకోడం కోసం జట్లు జట్లుగా వచ్చేవారు.

ఆరోజు బాగా ఎండకాస్తోంది. కువో గడ్డిటోపీ పెట్టుకుని, చేతిలో కొడవలితో పొలం బయల్దేరేడు గేటు యివతల పొడుగుమెడ హాన్ కువో చొక్కా పట్టుకు గుంజేడు.

"ఏం, ఏటికావాల?"అని అడిగేడు కువో

"అలా తోటలోకి వెళ్దాంరా. ఇక్కడ చెప్పలేను" అన్నాడు పొడుగుమెడ, తగ్గు స్వరంతో.

"ఇక్కడ ఫర్వాలేదులే. ఆ సెప్పేదేదో ఇక్కడేసెప్పు. నేను పోవాల."

"హాన్‌బాబు నీగురించే ఆలోచిస్తున్నారు. ఆ సంఘంకోసం పనిచేస్తావ్ కాని పైసాకూడ గిట్టదు. ఒకోరోజు బువ్వకూడా దొరకదు. కడుపు మాడ్చుకుని నువ్వేం పనిచెయ్యగలవు చెప్పు. అందుకే ఆయన నీకీడబ్బుపంపేరు. నువ్వు మరోలా అనుకోకు. స్నేహంవల్ల ఇచ్చేరు"అంటూ ఇంత కట్టతీసి కువో జేబులోకుక్కేడు, పొడుగు మెడవాడు.

కువో అతన్ని వెనక్కిపిలిచి ఆ కట్ట అతనిముఖాన్న విసిరేడు. అప్పుడేవీచిన గాలి ఆ నోట్లు ఎగరేసుకుపోయింది.

"తొత్తుకొడకా! ఎవడిక్కావాలిరా నీ ముదనష్టం ?" అంటూ కొడవలి ఎత్తేడు కువో. పొడుగుమెడ తెల్లగా పాలిపోయేడు. వెంటనే దొడుతీసేడు.

చుట్టూ చేరిన జనం గొల్లుమన్నారు—

"అద్గదీ, ఆడికి అలాగే సెయ్యాల"

"ఆణ్ణి సిత కెక్క తన్నవొలిసింది"

ఇంతలో పిల్లలు ఎగిరిపోయిన నోట్లకోసం పరిగెత్తేరు.

మళ్ళీ మర్నాటికి పుకార్లులేచేయి.

"పనిమిదో దళం కోసం కువో కన్నెపిల్లల్నీ, కొత్త పెళ్ళి కూతుళ్ళనీ కూడేస్తున్నాడు "

"ఆడోళ్ళెందుకు ?"

"ఎవరికెరిక ? పక్కజిల్లాల్లో రేషనుషాపుల్లో పెట్టి అడిగినోళ్ళకి అమ్మతారట"

"ఇప్పుడు తెలిసింది— 'మీ ఇంట్లో ఎంతమందున్నారు ? అందరికీ సరిపడ తిండి వుందా ? ఆడోళ్లు ఎంత మంది ? వయసెంత ?' ఇలాగే అడుగుతుంటే నానేటో అను

తున్నాను. నక్కసూసినా, కోడిపిల్లకాడికి నక్కినక్కి వొస్తాదీ. అలాగ వచ్చేవాడు"

అది మొదలు కువోగదికి జనం రావడం మానేసేరు. వానపడితే పొలాల్లో పనుండదు. అప్పుడుకూడా రాలేదు. పోనీ ఎవరింటికన్నా వెళ్దామంటే తనని దూరం నించీ చూడగానే తలుపులు మూసేవారు. మరికొందరు తమ పిల్లకి ఆటలమ్మ పోసిం దనీ, ఎవరూ రాగూడదనీ అనేవారు. లేకపోతే కిటికీకి ఎర్రగుడ్డకట్టి, ఎవరోపురుడు పోసుకుంటున్నారు రాగూడదని చెప్పేవారు.

ఇదంతా చూసేసరికి కువో బుర్ర తిరిగింది. స్కూల్లో చతికిలబడి తలదించుకు కూచున్నాడు.

"ఏమిటి, నీకు ఏఁవయింది ?" అడిగేడు సియావో. అతనివెనకే చిన్నవాంగ్ కూడా వచ్చేడు.

"నేనిక్కడ ఏటీ సెయ్యలేను- ఇంకెక్కడన్నా సెయ్యగలనేమోగాని. ఇక్కడ మాత్రం నావల్లకాదు" అన్నాడు కువో.

"ఏఁవిటయ్యా ఇదంతా ?" సియావో ఏమీ అర్థంగాక వాంగ్‌ని అడిగేడు.

"నాకూ తెలీటల్లేదు"

"నన్ను తప్పించుకు తిరుగుతున్నారు" అన్నాడు కువో.

"ఏఁవిటీ !" ఆశ్చర్యపోయేడు సియావో.

"ఎవలూ నాకాడికి రారు. పోనీ నానే ఆలకాడికి పోదునా అంటే నామొకంమీదే తలుపులు దభీమని మూసేస్తన్నారు."

సియావో కువోని వివరాలన్నీ అడిగేడు. చివరకు ఇదంతా కామందుల పన్నాగం అని తెలుసుకున్నాడు.

"చైర్మన్ చావోతోనూ, నీతో బాగావుండే మరికొందరితోను మాట్లాడి అసలు సంగతేంటో నాకు చెప్పు. పోట్లాడకుండా ఏదీ సాధించలేం. నుయ్యి తవ్వేందుకు బొరుగు దించినంత మాత్రాన ఏఁవీ అవదు- అది ఓర్పుతో, నెమ్మదిగా సాధించా ల్సిందే" అన్నాడు సియావో.

తేలికపడిన మనసుతో కువో చావో దగ్గరకు వెళ్ళేడు. చావోకికూడా కువోకి లాగానే చుక్కెదురయింది. ఇద్దరూ తమ స్నేహితుల్నీ, పొరుగువాళ్ళనీ కలిసేరు. వాళ్ళతో మాటాడేక తమని ఇంత దూరదూరంగా ఎందుకు చూస్తున్నారో అర్థమయింది.

"కామందుల మాటలు నమ్మకండి. అదంతా పచ్చి అబద్ధం!" అన్నాడు కువో.

"ఈ కార్యకర్తలు ఎక్కడెక్కడినించీ మనకోసం వస్తే ఇలాగేనేటి మాట లనడం? ఆల్లకి ఆడోల్లే కావలసొస్తే యువాన్ మావోదాకా రావాలేటి? హార్బిన్‌లో ఆడోల్లే నేరా?" అన్నాడు తీన్‌తాత.

"సియావోబాబు ఎంత మంచోడు!" అన్నాడు చావో. ఇంతలో ఓల్డ్‌సన్ అందుకున్నాడు:

"నిజవే. అలాటోడు కోటిమందిలో ఒకడు. వాంగ్‌బాబు, లియూబాబు కూడా అలాటోల్లె. మీ ఆడోల్లు ఎవరిక్కావాలి? వాంగ్‌బాబు మనవేపువాడే. ఓరోజు నానన్నాను 'బాబూ, నువ్ మా జిల్లాకే ముత్తెం లాటోడివి' అని. అప్పుడు ఆబాబేట న్నాడో ఎరికేనా? 'నువ్వే ఆనిముత్తేనివి. నువ్ శానా మంచిబండోడివి. గడ్డుదోవన ముందుకి నడుస్తున్నావ్' అన్నాడు. సియావోబాబుకూడా బండోల్లంటే వల్లమాలిన అబిమానం. నానే ఆ బాబుని మొట్టమొదాటిసారి యీవూరు తోలుకొచ్చేనని అందరి కెరికే. ఆ బాబు బండిలో ఏటన్నాడో నాకిప్పటికీ యాదస్తుంది 'పేదోల్లు అంతా మీదికి లేవాలి. ఔనంతావా, కాదంతావా?' నానొప్పుకున్నాను. 'ఓల్డ్‌సన్ ఒప్పుకుంటే యిప్ల వానికి యిజయమే' అన్నాడాబాబు. 'నాకు ఏటి బయ్యంనేదు. ఆ దయిర్యవే నన్ను వుత్తరానికీ దక్చినానికీ తిప్పుతోంది అని ఆమీ యిచ్చేను.'

"నీకు తెలివితేటలు ఏం తక్కువలేవుగానీ ఆరోజు గుర్రం తీసుకోడానికి మాత్రం దయిర్యంనేకపోయింది" అన్నాడు చావో నవ్వుతూ. అందరూ నవ్వేరు.

"ఓ, అదా—," అన్నాడు ఓల్డ్‌సన్ తడబడుతూ,

"నన్ను ఆపకండి. సియావో బాబు మంచోడు. ఆ బాబుతో నాకు జట్టు కుదురు తాది. రేతిరే ఆ బాబుతో సెప్పేను, 'బాబూ, తఁవరు వూరెల్లాలంటే సెప్పండి. నాను న్నాను. బురద తుల్లకుండా బండిని సాపీగా తోల్తాను' అని."

కలిసి మాటాడుకోవటంవల్ల జనం నిజం తెలుసుకోగలిగేరు. పుకార్లన్నీ మాయ మయేయి. మళ్ళా చిన్నాపెద్దా అందరూ కువోగదికీ, చావో యింటికీ రాసాగేరు.

కువో యజమాని లీచెన్–చియాంగ్‌కి, కువో వ్యవహారాలేవీ నచ్చలేదు–అతను భూ సంస్కరణ కార్యకర్తలతో మెలగటం, సలహాలకోసం జనం అతనిగదికి రావటం, అతన్ని 'వైస్–చైర్మన్'అని పిలవటం– ఇవన్నీ చిరాకుగావుండేవి. కాని ఎలాగో తమాయించుకున్నాడు. ఓరాత్రి అతను హాన్ ఇంటికివెళ్ళి, కువో సంగతంతాచెప్పేడు.

"ఇదంతా నీకళ్ళముందే జరుగుతోందా? అయితే ఇకనే! వాళ్ళు చెయ్యదల్చుకున్నవన్నీ కనిపెట్టి నాకు చెప్తూండు" అన్నాడు హాన్.

లీచెన్-చియాంగ్ నవ్వుతూ, పైపుపీలుస్తూ కువో గదివైపు నెమ్మదిగా నడిచేడు కాని అతను రావడం కిటికీలోంచిచూసి వాళ్ళు మాటలు మానేసేరు. పాపం, అతనికి ఏమీ వినబడలేదు. కువోని తిట్టుకుంటూ వెళ్ళిపోయేడు లీ.

ఓరోజు మీటింగునుంచి కువో ఆలస్యంగా వచ్చేసరికి ఇంటిముందు గేటు గడియ పెట్టివుంది. ఎన్నిసార్లు తట్టినా ఎవరూ పలుకలేదు. అతను చుట్టుతిరిగి వెళ్ళి గోడ దూకేడు. కాలుకిందపెట్టేడోలేదో, ఓ కుక్కవచ్చి అతనికాలు కరచింది. ఆ కుక్కని కావాలని ఒదిలేసేరని స్పష్టంగా తెలిసిపోయింది.

పర్నాడుదయం కువో చల్దన్నం తింటూండగా లీ కూతురు ఓ కప్పు పగలగొట్టింది. వెంటనే లీ భార్య ఆ పిల్లని కొట్టింది. ఆ పిల్ల ఏడుపు లంకించుకుంది.

"ఎందుకే ఆ ఏడుపు? తిని తిరగటంతప్పితె ఒక్కపని చెయ్యవు. మన రాబడేమో చాలాతక్కువ. అందులోనే జల్సారాయుళ్లనికూడా మేపాలంటే ఎలాగవుతుంది? తిన్నంతతిని, ఎవరెవరినో కల్సుకోడానికిపోతావు. ఇదేంసోద్యమో!" అంది లీభార్య.

ఈ మాటలు కువోకి వినిపిస్తూనే వున్నాయి. కోపాన్ని అణచుకుని "ఏంవమ్మోయ్, అత్తమీద కోపం దుత్తమీద చూపకండి. ఎవరమ్మా తిని తిరిగేది? ఎవర్నితంపరు తిడతంది? అనేదేదో తిన్నగా అనండి" అన్నాడు.

"నేనెవర్ని అన్నాను? నువ్వు భుజాలు తడుపుకుంటే నాకేం?" అంటూ అరిచిందావిడ. ఆ పిల్ల ఏడుపూ, ఈవిడ పెడబొబ్బలువిని జనం మూగేరు. పిల్లలు తలుపు సందుల్లోంచి చూడసాగేరు.

కువోకి కోపం పెరిగిపోతోంది. కాని కష్టాలునేర్పిన సహనంవల్ల కోపాన్ని అణచుకున్నాడు. కొంతసేపటికిలా అన్నాడు.

"నాను తిని తిరుగుతానా? ఇదేదో యీ రోజే తేలాల. నాను చెయ్యని పని ఏటున్నాది? దున్నడం అవగానే, బొరిగుచ్చుకుని తవ్వుతాను బొరిగకిందెట్టగానే కొడవలిపొట్టుకుంతాను. గడ్డి తొవ్వుతాను, మొక్కజొన్న కోస్తాను, తీగలకి పందిల్లు వేస్తాను, కాంగ్ బాగుసేస్తాను. గోడలకి సున్నాలేస్తాను. ఇవయేక పంటకోతకొస్తాది. ఆ తర్వాత ఎండుగడ్డి కోస్తాను, నీలుతెస్తాను, పందులకొట్టు అలుకుతాను, తిరగలి యిసురుతాను, కట్టెలు కొడతాను, ధాన్యం జల్లిస్తాను. ఏడాదికీ, ఏడాదికీమద్దిన తీరికే

నేదు నాకు. రెండొందల ఎకరాలు నువ్ కౌలుకిచ్చినావంటే అదంతా నా చెమటతో తడిసిందే. ఇంత పనిసేసినా నన్ను పనికిమాలినోడంతావా? నీదీ ఓ నోరేనా?"

"వినండి బాబూ, వాడు ఏం కూస్తున్నాడో! రెండురోజులకిత్రితం నువ్వు వైస్ చైర్మన్‌వయితే మేం నీకు సలాంకొట్టాలేంటి?" అని అరిచింది లీభార్య.

ఇంతలో లీ వచ్చేడు. మొగుణ్ని చొక్కాపట్టుకునివూపేస్తూ "నువ్వుండికూడా నన్ను తిట్టిస్తావా? నీ కంబారి, నోటికొచ్చినట్టు కూసేస్తూంటే నీకు చీమైనా కుట్టినట్టు లేదే! నీకు నేను చావాలనుందేటి?" అని సాధించింది.

ఎవరో కువోని ఇంటిబైటికి లాక్కొచ్చి, ఆవిడమాటలు పట్టించుకోవద్దనీ, తన పనేదో చూసుకొమ్మనీ చెప్పేరు. కువో గేటువైపునడిచేడు— అతను కార్యకర్తల దగ్గరకు వెళ్తున్నాడనీ భయమేసి లీ అతన్ని అందుకోను పరిగెత్తేడు.

"ఎక్కడికి వెళ్తున్నావ్?" అని లీ అడిగేడు. కువో ఏమీమాటాడలేదు. పోనీ వెనక్కి తిరిగైనా చూళ్ళేదు.

"ఈ విషయం కార్యకర్తలకి చెప్పకు. మనలో మనమే సర్దుకుందాం. దానిచేత నీకు తర్వాత క్షమాపణ చెప్పిస్తాను" అన్నాడు లీ మళ్ళీ.

కువో వుడుకెత్తిపోతున్నాడు. అతను కార్యకర్తలకోసమే బయల్దేరేడు. వాళ్ళు తనని ఓదార్చి, సలహాఇస్తారు. బహుశా తనకి వుండడానికి చోటుకూడా చూపించొచ్చు.

కువోతో కొంతసేపు అవీయివీ మాటాడేక, సియావో

"పీ-లాయి అంటే ఎవరు?" అనడిగేడు.

"దొంగలనాయకుడు" అన్నాడు కువో. ఇప్పుడాప్రశ్న ఎందుకువచ్చిందో అర్థంగాక.

"అతన్ని ఎప్పుడేనా కలిసేవా?"

"లేదు. కాని యిదంతా ఏటి సియావోబాబూ?"

"నేనేవచ్చి నీకిది చూపిద్దామనుకున్నా"నంటూ సియావో జేబులోంచి ఓకాయితం తీసేడు. దానిమీద ఏదో రాసివుంది. కాని కువోకి చదవటం రాదుకనక సియావో చదివి వినిపించేడు.

"కువో తాచింగ్ కొండల్లోవుండే పీ-లాయి అనుచరుడూ, గూఢచారీను." దానికింద సంతకంలేదు.

"సియావోబాబూ... ఇదేదో నువ్వేసూడు..."

"నేను చూసేను"

"మీరు నమ్మితే నన్ను జేలుకి పంపండి."

కువో‌కి ఇంతవరకు లీ భార్యమీద కోపంగావుంది. మళ్ళీ యిప్పుడీనింద. అతని కళ్ళలో నీళ్ళు తిరిగేయి. గొంతుకి అడ్డంపడింది. తలదించుకు నించున్నాడు.

"నేను యిది నమ్మితే నిన్నెప్పుడో అరెస్టుచేసేవాణ్ణి" అన్నాడు సియావో నవ్వుతూ. కువోతో అది ఎలా దొరికిందో చెప్పేడు– మూడురోజులక్రితం కిటికీలో కనిపించింది. ఇంతకుముందు విందుకి హాన్‌పంపిన ఆహ్వానంమీద దస్తూరి యిలాగేవుంది. అందుకని ఇది హాన్‌చేసినపనే అవుతుంది.

"ఇదేమీ పట్టించుకోకు. ఎదురుతిరిగితే ఎవరూ ఏమీ చెయ్యలేరు" అన్నాడు సియావో ఓపక్క ఓదారుస్తూ, మరోపక్క రెచ్చగొడుతూ.

కువో లీ భార్యగురించి ఏఁవీ చెప్పలేదు. మాటాడకుండా లేచి వెళ్ళిపోయేడు. వాన మూలాన అంతా బురదగావుంది. అయినా పక్కగా నడవకుండా ఆ బురదలోనే నడవసాగేడు కువో.

"కుమీనిష్టోల్లు నేసిందే సేస్తాను. నాపేనం పోయినాసరే ఈ బుగతల అంతు సూస్తాను" అనుకుంటూ లీ యింటిముందుకి ఒచ్చేడు కువో. లోపలికి వెళ్ళటానికిష్టం లేనివాడిలా వెనక్కితిరిగి పాయి యింటివేపు నడిచేడు.

"పాయి వున్నాడా?"అని కేకేసేడు.

పాయిభార్య అంట్లుతోముతోంది. తీర్రైన కనుబొమలు ముడిచి లేడంది.

"ఎక్కడికి వెళ్ళేడు?"

"ఎవరికెరిక? ఎవరిక్కావాలి?"

ఆవిడ ఏదో వింతగా మాటాడటంచూసి కువో వెనక్కి తిరిగేడు. ఎటో నడుస్తూంటే చావో పిలిచేడు. కువో అదోలా వుండటంచూసి "అదేఁ, అలాగున్నావేటి?" అని అడిగేడు.

"నాకు వుండేందుకు జాగానే లేదు. లీ నన్ను పొమ్మన్నాడు."

"మా యింటో వుందూగాని, రా"అన్నాడు చావో.

"మరి తిండెలాగ?"

"మా యింటో యింకా చోల్లున్నాయి. పర్వాలేదు, రా."

ఆ సాయంత్రం సియావో చావో యింటికి వచ్చేడు. ఆ రంగురంగుల చింకి చొక్కాతప్ప కువోకి ఏమీలేవని తెల్సుకుని, ఓ పాతచొక్కా, దుప్పటి పంపేడు. అవి

తెచ్చిన మనిషి, సియావో పాయిని కల్సుకోవాలనీ, అతను ఎక్కడున్నాడో చెప్పమనీ కువోని అడిగేడు.

"నాకు తెలీదు"అన్నాడు కువో.

మరి పాయి ఎక్కడికి పోయేడు ?

# 11

సాయుధదళానికి నాయకుడవడంతో పాయి ఎప్పుడూ హడావుడిగా వుండేవాడు. ఇంకా తెల్లవారకముందే బయటికిపోయి, మళ్ళీ ఏ అర్ధరాత్రికో తిరిగొచ్చేవాడు.

ఇంతకుముందైతే అతనికి యీ హడావుడి నచ్చేది కాదు. "రేపనేది వుండగా యియ్యాల యీ గడబిడ దేనికీ ?"అనేవాడు. కాని ఇప్పుడు పూర్తిగా మారిపోయేడు. ఎప్పటిపని అప్పుడు ఎలా పూర్తిచేయడవా అని చూస్తూండేవాడు. అతన్ని ముందు నుంచీ ఎరిగినవాళ్లు అతని ఆరాటంచూసి"రేపనేదివుండగా ఇయ్యాల యీ గడబిడ దేనికీ?" అనేవారు, వెక్కిరింతగా. "నాను అలా వుండలేను. ఉప్పుడు టైం సాలా ఇలవైనది" అనేవాడు పాయి.

అతనిలో మార్పుకి అందరికంటే అతని భార్య ఆనందించింది. గుడ్లు పెట్టే కోళ్ళు రెండు వుండడంతో, అతను ఇంటికి ఎప్పుడు ఆలస్యంగావచ్చినా గుడ్లు ఉడకేసి పెట్టేది. రోజూ పండగ భోజనం అనిపించేలా చేసేది. అతని కోసం ఎంత రాత్రి వరకైనా ఎదురుచూస్తూ కూర్చునేది. ఆ ఇద్దరూ కొత్తగా పెళ్ళయినవాళ్ళలా వుండేవారు. పాయి భార్య పొరుగువాళ్ళతో "సియావోబాబు మనపాలిటి దేవుడే. నేకపోతే పాయేటి, ఇంత మారిపోటమేటి ?"అనేది.

ఓ రోజు పాయి భార్య వాళ్ళ తోటలోని చిక్కుళ్ళు ఓ బుట్టెడు కోసింది. అవి కార్యకర్తలకి యిద్దామన్న ఊహకలిగిందిఆమెకి. వెంటనే తలదువ్వుకుని, వున్నవాటిలో కాస్త తక్కువ మాసికలేసిన గుడ్డలు వేసుకుంది. పది గుడ్లుకూడా బుట్టలోపెట్టుకుని బయలు దేరింది. దారిలో పొడుగుమెడ హాన్ తగిలేడు.

"ఎక్కడికీ వెళ్త ?"అన్నాడు నవ్వుతూ.

వాడు వెధవని ఆమెకు తెలుసు. పాయి వాడిగురించిచెప్పేడు. కాని ఆడవాళ్లందరిలాగే తొందరగా మనుషుల్ని నమ్మేస్తుంది. వాడు ఎంతో మర్యాదగా నవ్వుతూ మాటాడేసరికి అంతా చెప్పేసింది.

"కార్యేకర్తలకాడికి ఎల్తన్నా. ఆల్లకె యిక్కడ కొత్తగదా అని చిక్కాల్లు. గుడ్లూ వొట్టుకెల్తన్నా. మనకోసరం ఆల్లు అంత పాటుపడతంటే, తినేందుకు మంచి కూరలన్నా ఇయ్యాలిగదా ?"

"వాళ్లు మనకోసం పాటుపడుతున్నారని ఎవరమ్మా నీకు చెప్పింది ?"

"పాయి చెప్పేడు"

"నిజఁవే"అని ఒప్పుకున్నాడు పొడుగుమెడ. ఇప్పుడు మొగుడు పెళ్లాలమధ్య ఏ తగువులేదనీ, వాళ్లు సఖ్యంగా వుంటున్నారనీ అతనికి తెలుసు. కాని మరీ ఎక్కువ ఒప్పేసుకున్నానేమో అని అనుమానంవేసి తమచుట్టూ జాగ్రత్తగా పరిశీలించేడు. ఎవరూలేరని తెలిసేక, పాయిభార్యతో నెమ్మదిగా ఇలా అన్నాడు:

"ఇది నీకు తెలుసా ...?"

"ఏటి తెల్నా ?"

"నీకు నిజంగా తెలీదా ?"అన్నాడు పొడుగుమెడ ఆశ్చర్యం నటిస్తూ.

"ఏటది ? బేగిచెప్పుమీ"

"మరేమో...సియావో బాబేమో...పాయినీ.. అబ్బ, వొద్దులే. మళ్ళీ నీకు చెప్పిందగ్గరనించీ నన్నేఁవేనా అంటారు." వెళ్ళిపోవడానికన్నట్టు కాళ్ళు కదిపేడు పొడుగుమెడ హాన్.

"సెప్పు. సెప్పకపోతేనే ఏమైనా అంతాను"

"ఆఁ ఏంలేదు. పాయికి బాగా ముందుచూపుందని సియావోబాబుకి చాలాఇష్టం. కాని పాయి ఏఁవంటాడోతెల్సా ? 'నా పెళ్ళాం కానా పాఁకాలపుది.' అప్పుడు సియావో 'దానిదేముందిలే నువ్వు బాగా పనిచేస్తే నీకోమంచి పిల్లని చూసిపెడతా. దగ్గర్లోనే ఓ సంబంధంకూడావుంది' అన్నాడు."

"ఏటేటీ? ఎవరెవరికీ పెల్లి?"

"పాయికీ, మరోపిల్లకేను"

"ఓహో! ఆ పిల్ల ఎవతో సెప్పుమీ"అంది పాయి భార్య కనుబొమలు ముడుస్తూ.

"ఆమాట నన్నడక్కు"అన్నాడు పొడుగుమెడ. తను చెప్పిందంతా ఆవిడ నమ్మేసిందని ఇంకా ఇంకా రహస్యంగా అన్నాడు.

జేవురించిన ముఖంతో పాయి భార్య వెనక్కి తిరిగింది. కాని వాడింకా రెచ్చగొట్టేడు.

"ఏఁవేఁ, ఇంటికెళ్ళిపోతున్నావా? గుడ్లు, చిక్కుళ్ళు సియావో బాబుకి ఇవ్వవా? పోసి నేనిచ్చిరానా?"

"ఈఁని ఏ ఏట్లోనన్నా ఎత్తేస్తానుగానీ సియావోగాడికి మాత్తరం ఒటుకెళ్ళి య్యను" పొడుగు మెడ హాన్‌ని పక్కకినెట్టి మొగుణ్ణి శాపనార్థాలుపెడుతూ ఇల్లు చేరుకుంది.

ఎప్పటికో అర్థరాత్రికి వానలో తడిసి ముద్దయి వచ్చేడు పాయి. అతనిభార్య నిద్రపోతోంది. ఇల్లంతా చీకటిగావుంది. వంటింట్లో వేడినీళ్ళులేవు. అతను దీపం వెలిగించి, తడిబట్టల్ని కొంగుమీద ఆరేసేడు. అలమరలో తినేందుకు ఏఁవీలేవు. తలుపు దభాలున మూసేడు ఆ చప్పుడుకయినా భార్యలేచి తనకి ఏఁవైనా పెడుతుందేమోనని. కాని ఆవిడ లేవలేదు.

"గుడ్లు ఎక్కడే?" ఆకలిగా వుండడంతో కొంచెంగట్టిగానే అరిచేడు పాయి.

"నీకు గుడ్లుకావాలేఁ గుడ్లు? సుప్ పొద్దోయిందాకా ఎలా తిరుగుతున్నావో నాకు తెలవదనుకున్నావా?"అంది పాయిభార్య, లేచి కూచుంటూ.

"చూడు, నాకేఁవైనా పెట్టు, బేగి తొంగుంటా. మల్లా రేపు తెల్లారే లేవాల". అంటూ పాయిగుడ్లకోసం వెతకసాగేడు. ఇంతలో గుడ్లు, చిక్కుళ్ళు వున్న బుట్ట దొరికింది. కాని వెంటనే అతని భార్య బుట్ట లాగేసుకుంది.

"నువ్వు యీ గుడ్లు అంటనానికి వల్లకాదు" అంది.

"ఎందుకేటి?" అన్నాడు పాయి విసుగ్గా. ఆ బుట్ట ఒక్కళ్ళదగ్గర నుండి ఒకళ్ళు లాక్కున్నారు. చివరకు గుడ్లన్నీ కిందపడి చితికిపోయేయి.

నిశిరాత్రి ఆరఁభమైన ఆ రగడ విని చాలామంది మూగేరు— కొందరు వేడుక చూస్తుంటే, మరికొందరు తగువు తీర్చటానికి ప్రయత్నించేరు.

"ఓసి ఆపర్రా. అద్దరేతిరి అందరూ తొంగునేకాడ యీ తగువులేటర్రా?"

"ఆలూమగల తగువులికి అద్దరేతిరి కాప్పోతే మరింక తీరికెప్పుడు?" అన్నదో నడివయసు క్కిరాలు.

"ఆఁ పెద్దతగువేఁ కాదుర దద్దా, నోరుమూసుక తొంగుండర్రా" అన్నాడు ఓ పొరుగింటి మనిషి.

"ఒద్దొద్దు. దెబ్బకు దెబ్బ— యుద్ధం సాగవలిసిందే", యీ వేడుక చూస్తున్న వాళ్ళెవరో అరిచేరు.

"అవును మీరేసెప్పండి బాబూ" అంది పాయిభార్య. "మీరే సెప్పండి సబువెవరిదో సబూ తప్పిందెవరో మీరే సెప్పండి. పొద్దుపొడిసింది లగాయతు నానే పాటుపడతానా! ఈ మడిసేఁవోఁ వూరంతా ఏలేసివస్తాడు. పార్టీపనని పేరు. ఎక్కడెక్కల్లేని ఆడోల్లూ యీడికే కావాల. ఆడికి నా పొదే గిట్టడంనేదు ఒకపాలి అద్దంలో సూసుకుంటే బాగున్ను. ఈ దిస్టిపిడతకి ఏ దాయి వస్తాదో తెలిసొచ్చును."

"దొంగలం...., ఏటేకూసేవ్?"అంటూ చెయ్యిలేపేడు పాయి.

ఏడుస్తూ అతనిచేతుల్లోకి వచ్చిపడింది.

"కొట్టు కొట్టు. నాను ఇయ్యాల నీ సేతిలో సచ్చినా మంచిదే. ఓరికొడకా నీ అమ్మకొచ్చిన పాట్లు సూడ్రా. నానెందుకు మిగిలిపోనానురో!"అంటూ శోకాలు అందుకుంది.

తగువు పెరుగుతుండగా ఓ పొడవాటి మనిషొచ్చి పాయిని బైటికి యీడ్చుకుపోతూ

"మా ఇంటికి పోదాంరా. ఆడదాయితో తగువేటిరానీకు? కడుపు జరగని కష్టాలకి తోడు కయ్యాలొకటా?"అన్నాడు.

ఇతను పాయి స్నేహితుడు'లీ'. కాని 'లక్ష్మీపుత్రి'అనే అర్థంలో తనని తాను 'చిన్నమ్మగారి చిట్టయ్య'ను అని పిలుచుకునేవాడు. ఎందుకంటే—అతనికి ఈ లోకంలో తను తప్ప పేరుకైనా మరి ఆస్తి లేదు. అతనికి ఇంట్లో చలికాచుకోడానికి నిప్పుండేది కాదు, తినడానికి తిండి వుండేదికాదు, కాంగుమీద కప్పుకోడానికి దుప్పటివుండేదికాదు. నిజం చెప్పాలంటే రోజురోజుకీ అతని పేదరికం పెరిగిపోతోంది. అతనికి ముప్పై ఏళ్లుంటాయి. పదహారో ఏటినుండీ కమ్మరం చేస్తున్నాడు. ఇంకా పెళ్ళికాలేదు. జబరు మనిషి కావడంవల్ల అందరూ అతణ్ని 'పెద్దలీ'అని పిలిచేవారు.

"పెద్దలీ! నీ ఒయిసులోసగం పనితోనే తీఁపోయింది. ఇంకయినా పెళ్ళాన్ని తెచ్చుకోవేట్రా?"అని అడిగేవారు.

"నాకే మెతుకుల్లేవు. నన్నెవర్తి వొలచొస్తాదీ?"అనేవాడు లీ.

ఓ శీతాకాలంలో* పెద్ద లీని లేబరు క్యాంపుకి వెళ్ళమని తాఖీదువచ్చింది. అతను వెంటనే ఒప్పుకున్నాడు. "గవర్మెంటు కోసం నానేటయినా సేస్తాను" అన్నాడు. ఆ జపాను క్లర్కు చాలా సంతోషించేడు.

"నువ్వు చాలా మంచివాడివిలా వున్నావోయ్. మరో మాటనకుండా వొప్పుకున్నావ్. అయితే ఇంటికిపోయి సర్దుకో. రేపే బయల్దేరేది."

* 1941 లో

ఆరాత్రి లీ నిద్రపోలేదు. పొరుగువాళ్ళకి ఏవేవో చప్పుళ్ళు వినిపిస్తూనేవున్నాయి. మర్నాడు చూస్తే అతని యింటి తలుపు ఎంతకీ తెరుచుకోలేదు. బొచ్చెలూ, సుత్తీ, దాగలీ పెరట్లో పాతిపెట్టి, గదిలో ఓ పాతబల్లా, చెప్పులూ మాత్రం మిగిల్చేడతను.

లీ తనతో పలుగు, పార మాత్రం తీసుకెళ్ళేడు. దక్షిణానవున్న గేటులోంచి వూరుదాటి, ఏడుమైళ్ళదాకా పరిగెత్తేడు. అక్కడ ఓ గడ్డివాములో దాగున్నాడు. తెల్లారేదాకా చలికి వజవజ వణికిపోయేడు.

చివరకి ఓ సరుగుడు తోటలో చిన్న గుడిసె వేసుకున్నాడు. అతని పలుగు, పార బాగా పనికొచ్చేయి. దొరికిపోతానేమోననే భయంకొద్దీ పగలు అడవిలో దాక్కునేవాడు. అక్కడి నుండి అతనికి అందరూ కన్పిస్తారు గాని అతను ఎవరికీ కనిపించడు. రాత్రుళ్ళు మాత్రం గుడిసెలో పండుకునేవాడు.

ఓరాత్రి అతను బల్లమీద నిద్రపోతుంటే ఏదో వింత చప్పుడు వినిపించింది. అది ఎక్కడినించి వస్తోందా అనుకుంటూ చెయ్యి కింద ఆనించేడు. చల్లగా, సన్నగా, నున్నగా తగిలింది. అతనికి గుండె ఆగినంత పనయింది. కాని అది అతన్ని ఏమీ చెయ్యకుండా గడ్డిలోకి జారుకుంది— పెద్ద పాము!

వానాకాలం దాటగానే అతనికి తినేందుకు చాలా దొరికేయి— పుట్టగొడుగులూ, యిప్పపూలూ, గట్టివేళ్ళూ, దుంపలూ, జీలుగుచెట్ల బెండూ— ఒకోసారి దూరానవున్న పొలాలకిపోయి దుంపలూ, మొక్కజొన్నా తెచ్చుకునేవాడు. శీతాకాలంలో అడవి కోళ్ళని తినేవాడు. వేసవికాలంలో రకరకాల కూరగాయలు దొరికేవి. ఇలా ఓ ఏడాది గడిపేడు. కొంతనేల సాగుచేసి మొక్కజొన్న, కర్రపెండలం వేసేడు. మళ్ళీ జపానోళ్ళు లొంగిపోయేక యువాన్ మావోకి తిరిగొచ్చేడు.

రైతు సంఘం ఏర్పడినపుడు పాయి ఓ రాత్రంతాకూచుని పెద్దలీతో మాట్లాడేడు. అతన్ని సంఘంలో చేరమని సలహాయిచ్చేడు.

"నాకు కొంత టైం కావాల"న్నాడు లీ.

మరో రెండ్రోజులు పోయేక అతను పాయితో

"నాకూ రైతుసంగంలో సేరాలనే వున్నాది కానీ 'నలుగురితో నారాయనా'అనిపించుకోవడం నాకు ఇస్టంలేదు. నానే ఆలోసించి ఏదన్నా సెయ్యాల"అన్నాడు.

"మర్రేదైనా ఆలోసించేవా?"నవ్వుతూ అడిగేడు పాయి.

"ఇనుకోమరి. నా పీక తెగ్గోసీసి, నా తల ఎగరేసుకపోయినా సరే, నాను పార్టీని ఒగ్గను."

రైతుసంఘంలో ఓ గ్రూపుకి పెద్దగా ఎన్నికయేడు.

పాయికి భార్యతో తగువైనరాత్రి పెద్దలీ అతన్ని ఇంటికి తీసుకుపోయి, తగువుకి కారణం అడిగేడు.

"నాకేటీ తెలీదు" అన్నాడు పాయి.

పెద్దలీ నవ్వి "తగువెందుకో ఏటో తెలీకుండానే ఇంతసేపూ ఊరగడసేసేవా? ఉత్తి ఎదవ్వి. ఊఁ, సర్లే, తెల్లగా తెల్లారతాంది. ఏవఁన్నా తిందాంరా. మీ ఆడ మనిసికి అంతా నాను సెప్తాలే.

"ఇదుగో పాయి! గొప్పోలు ఒకలకొకలు ఎలాగ సాయపడతారో పేదోల్లూ అలాగే ఒకలకొకలు సాయపడాల. నువ్ సంగంలో వున్నావుగనక పేదోల్లని నువ్ నడిపించాల. అలాటోడివి నువ్వే తగువేసుకుంటే పైయ్యోళ్లనవ్వరా? నువ్వు పోయి చేలో చిక్కుళ్ళుగట్రా కోసుకురా. నాను పొయ్యిరాజేస్తా"

ఏదో కాస్త తిన్నాక పాయిని తన యింట్లోనే వుండమని, పాయి భార్యతో మాట్లాడేందుకు వెళ్ళేడులీ ఆవిడ అప్పుడే పెరట్లో పందికిపెట్టడానికి తొట్లో కుడితి కలుపుతోంది. పెద్ద లీ రావడం చూసికూడా చూడనట్టు తలదించుకుని పనిచేసుకో సాగింది. చెట్లసందుల్లోంచి పడుతున్న ఎండకి ఆమె సిగ పిన్నులు తళతళలాడుతున్నాయి.

లీ ఆవిడదగ్గరసా వెళ్ళి పలకరించేడు. ఆవిడ తలెత్తి ఒకసారిచూసి మళ్ళీ తల దించుకుంది. రాత్రికోపం ఆవిడకి తగ్గలేదు, ఇంకా కనుబొమలు ముడుచుకునేవుంది.

"ఆ పందిపిల్ల బాగుందే. మరోఏడాది ఆగితే మంచి కరీదు కాస్తాది."

"రావొచ్చు" అంది పాయి భార్య, తలెత్తకుండానే. ఆవిడకి భర్తమీదా, తమ విషయాల్లో తలదూర్చినందుకు లీ మీదకూడా కోపంగానేవుంది. అసలు తనమనసులో వున్నదంతా చెప్పుకునే అవకాశంలేకుండా తన భర్తని అతనెందుకు పట్టుకుపోవాలి? కోపంగా పెదాలు బిగబట్టి లోపలికి పోయింది. లీ ఆమెవెనకే వెళ్ళేడు. తగువు తీరుద్దామనే వచ్చేడుగాని అతనికి మాటలు రావడంలేదు. కాంగ్‌మీద నల్లటిచొక్కా చూస్తే పాయి చొక్కా వేసుకోలేదన్న సంగతి గుర్తొచ్చింది లీకి. వెంటనే చిన్న అబద్ధం ఆడేసేడు.

"పాయికి సిరుసుపోటుతో కళ్ళిద్దంనేదు. రాత్రంతా మంచుకీ, సలికీ ఒణొట్టి పోనాడు."

"అంతే కావాల!" అంటూ ఆవిడ కాంగ్‌మీద కూచుని కుట్టుసామాగ్రి బైటికి తీసింది. లీ కాంగుకి మరోపక్కగా కూచుంటూ 'ఏఁవనాలా?' అని ఆలోచిస్తూ, ఓ పొగాకుపాయతీసి చుట్టచుట్టుకుని, వెలిగించేడు కొంతసేపు సిబ్బాపాటి మాటాడేక,

"మూనిరుడు నీకాడ ఓ పందిపిల్ల వుండాల. అది ఏడాదిసివర్న అమ్మితే ఎంత కొచ్చిందేటి?" అన్నాడు తాపీగా.

"ఏడాదిసివరిదాకా వున్నాదేటి— అయ్యో రాత! కొత్తా(వాసముందు ఆన్ దాన్ని తుపాకీతో కాల్చేసినాడుకాదా?"

ఇలా చెప్తూంటే, కష్టాలు ఒకదానివెంట మరోటి ఎలా ముంచుకొచ్చాయో గుర్తొచ్చింది. తన బిడ్డ గుర్తు రావడంతో కళ్ళనీరు తిరిగింది. పెద్దలీకి యీ విషయాలన్నీ తెలుసు. సందుదొరికిందేచాలని,

"అవునవును, ఆ ఏడాతేకదా సిన్నోడు సచ్చిపోనాడు?" అన్నాడు బాధగా.

"ఈ ఆనే సంపేసినాడు. ఈ ముండగండడికి గుండెల్లో గునపాలు ఎవరు గుచ్చుతారో" అంటూ హాన్‌ని తిట్టి దిగబారపోసింది.

ఆవిడ తన కోపాన్ని భర్త మీదనుంచి అసలు శత్రువుమీదికి మరల్చడంతో, హాన్‌చేసిన దురాగతాలు గుర్తు చేసేడు లీ. రైతు సంఘం పేదవాళ్ళందర్నీ 'వెన్నుతట్టి లేపి' ఆ హాన్‌ని పడగొడుతుందనికూడా చెప్పేడు.

"సిన్నోడిని సంపినందుకు హాన్‌మీద పగతీర్చుకొనే రోజురాదా?" అన్నాడు.

"అద్సరే, ఆడు రేతిరేలే బైటికెందుకెల్లాల?" అంది.

"పగలంతా చేలో పనిలేదామరి? అది అయినంకనేకదా తను పార్టీ పని సూసుకోవాల?"

ఆమె తలొంచుకుంది. కోపం తగ్గింది తన తెలివితక్కువకి సిగ్గుపడింది. ఆ పొడుగుమెడగాడు ఏదో అన్నాడని తను ఎంత గడబిడచేసింది! భర్తతోనూ, లీతోనూగూడ సరిగ్గా వుండలేదుతను.

"నీతో ఎవరేటి మాటాడింది? పాయి గురించి నీతో ఆడు ఏటన్నాడు?"

ఆవిడ జరిగిందంతా చెప్పింది.

"అలాపెదవని ఎలా నమ్మేసినావ్?" అన్నాడు లీ.

"ఆడూ పేదోడేగామరి?" తను మోసపోయేనని తెలిసికూడా సమర్థించుకోబోయింది పాయిభార్య.

"నువ్ యీ ఊరిదానివేగదా. ఆడు ఎంత దగుల్బాజీనో నీకెరికనేదా?"

"ఎంతైనా పేదోడు పేదోడే లెమ్మనుకున్నా"

"ధూ. ఆడూ మడిసేనా? అసలాడు మడిసిలాగుంటాడా? పాయి అలాగకాదే. మనకోసం ఏదైనా సేస్తాడు. నువ్ పాయికి సాయంవుండాలగానీ అలా తగూలాడుకుంటే ఎలాగ?"

"నిజఁవే. ఇదంతా ఆ పొడుగుమెడగాడు పెట్టిన పితలాటం...ఆఁ. ఉప్పుడు తలపోతెలాగుంది ?"

"ఎవురికి ? ఓహో... పాయికా ? నువ్వు మంచిగుంటే ఆడికి ఏ తలనెప్పీ వుండదు. ఆణ్ని నీకాడికొట్టుకొస్తా నిప్పుడు"అంటూ నవ్వుతూ లేచేడు పెద్ద లీ.

"ఆగు, ఆడికి ఈ చొక్కా కాస్త ఇచ్చీద్దూ"అంది పాయి భార్య

లీ వెళ్ళిపోగానే ఆవిడ గబగబా తల దువ్వుకుని, పొరుగింట్లో డజను గుడ్లు తెచ్చింది. పాయి వచ్చేక రాత్రి తగువుగురించి ఇద్దరూ ఎత్తుకోలేదు. పగలంతా పొలం పనులు చూసుకుని, చీకటిపడుతూండగా ఇల్లుచేరేడు. భోంచేసి మళ్ళా కార్యకర్తల్ని కల్సుకోను బయల్దేరేడు. అతని భార్య సియావోకిమ్మనిచెప్పి బుట్టెడు కూరగాయలు, గుడ్లు తీసుకొచ్చియిచ్చింది పాయికి. పార్టీ రూల్సుప్రకారం సియావో అవి తీసుకోలేదు.

ఆ రాత్రి ఎప్పటికంటె ముందుగా వచ్చేడు పాయి. వెచ్చగావుందని చొక్కా విప్పేసి, కాంగ్ మీద పండుకున్నాడు. అప్పుడుగాని ముందురోజు తగువు గురించి ఎత్త లేదు.

"అంతకుళ్లేటేనీకు ? మాటనేముందు ఎనకా ముందూ 'ఇశారన', 'ఇవఁర్స' వుండాల"అన్నాడు. ఈ మధ్య అతనికికూడా పార్టీ పదజాలం ఒంటబడుతోంది.

## 12

అప్పుడప్పుడే గోధుమ కోతకొస్తోంది. లేకుపచ్చటిచేలు పచ్చబారుతున్నాయి. ఊరికి తూర్పువేపునున్న మడుగులో రెల్లుదుబ్బులమధ్యనున్న పసుపుపచ్చని కలువపూలు దూరానికి బంగారపు పూతలా వున్నాయి. దక్షిణంవేపు కొండలు ఆకాశంలోంచివేళ్లాడే ఆవిరిమబ్బుల్లావున్నాయి. కొన్ని పిచికలు కిచకిచలాడుతూ చుట్టి చుట్టి ఎగురుతుంటే, మరి కొన్ని ఇంటి చూర్లకిందచేరి ముక్కుతో రెక్కలు సవరించుకుంటున్నాయి వానలు బాగా కురవడంవల్ల పాదులకిక నీళ్ళపనిలేదు. ఆకాశంలో ఇంకా అక్కడక్కడా ఓ నల్లమబ్బో, తెల్లమబ్బో కనిపిస్తూనేవుంది.

మధ్యాన్నం ఎండ తీవ్రతకి గుర్రాలు బుసకొడుతున్నాయి. కుక్కలు నాలికలు బైటికిచాచేయి. రాత్రుళ్లు మొక్కజొన్న చేలలోంచి వీస్తున్న గాలికి ఆకులు రెపరెపలాడుతున్నాయి. మబ్బులు గుమికూడి ఆకాశం నల్లబడింది. మరి కొద్దిసేపట్లో

వురుములు మెరుపులతో కుండపోతగా కురిసింది వాన. ఆగి ఆగి కురుస్తున్న వానలకి వీధులన్నీ రొచ్చురొచ్చుగా చీదరగా తయారయేయి. జనం జోళ్ళులేకుండా వీధివారగా నడుస్తున్నారు.

హాన్‌తో మరోసారి భేటీవెయ్యడానికి తయారవుతున్నారు జనం. చావో, కువో, పాయి, పెద్దలీ పొద్దస్తమానం హడావుడిగా తిరుగుతున్నారు. రైతు సంఘ సభ్యులు ముప్పై నుంచి అరవైకి పెరిగేరు. లియూ-తె-షాన్ వానల్లోకూడా పేదవాళ్ళనికలిసి ఎప్పటికప్పుడు జరిగిందంతా సియావోకి చెప్పేవాడు. పెద్ద లీకి లియూ అంటే అంతగా యిష్టంలేదు. ఎందుకంటే లియూ పేరుకోసం పాటుపడుతున్నాడు తప్పితే, ఏదీ మన స్ఫూర్తిగా చెయ్యడు.

ఓరోజు లియూ కార్యకర్తలతో మాట్లాడి ఇంటికి వెళుతుంటే దారిలో పొడుగు మెడహాన్ ఎదురయేడు. అతన్ని తప్పించుకునే వీలులేక లియూ నవ్వుతూ పలకరించేడు.

"ఏంవోయ్, ఏదో పెద్ద హోదాలోనే వున్నట్టున్నావ్ ?"

"లేదు బాబూ, కాలం అలాగ తోసుకొచ్చినాది. నాను పైకిరానేకపోయేను" అన్నాడు లియూ యిబ్బందిగా నవ్వుతూ.

"మళ్ళీ ఏదో మీటింగు అవుతాదట, ఈమారు ఎవర్నేంటి ?"

"నాకు తెల్దుబాబూ. ఉత్పత్తి కార్యక్రమం మటుకే నా పని"

హాన్ కుటుంబమంటే అతనికి ఎంత మంటవున్నా, దాన్ని బైటికిచెప్పే ధైర్యం లేదు లియూకి. అలా అని పొడుగుమెడవాడిముందు రహస్యాలు బైటపెడతాడనీకాదు. హాన్‌తోనే పోరాటం అని లియూకి స్పష్టంగా తెలుసు కానీ అది చెప్పటం యిష్టంలేక ఏదో రెండుముక్కలు గొణిగేసి వెళ్ళిపోయేడు.

సియావో చాలాసార్లు తీన్‌తో మాట్లాడేడు. తను కట్టుకున్న మూడు గదుల యింటిని హాన్ ఎలా స్వాధీనంచేసుకున్నాడోచెప్పేడు తీన్. "హాన్‌ని ఎదిరించగూడదా" అని పురికొల్పాడు సియావో.

"అడికీవూల్లో తిరుగునేదుబాబూ" అన్నాడు సత్తెకాలపు తీన్.

"నువ్‌గాని వెనక్కి మల్లనంటే, మేం నీకు తోడుంటాం" అని హామీయిచ్చేడు చావో. తీన్ అయిష్టంగానే ఒప్పుకున్నాడు.

భూసంస్కరణ కార్యకర్తలు, వూళ్ళోని చురుకైనవాళ్ళ కుర్రాళ్ళ కలిసి మర్నాటి మీటింగు గురించి రహస్యంగా చర్చించేరు. తీన్‌తాత కూతురి గురించిన ఫిర్యాదే ఆ నాటికి ముఖ్యంగా భావించేరు. మీటింగుకి ముందే హాన్‌ని అరెస్టు చెయ్యడం మంచి దనుకుని అలా చేసేరు.

ఈమారు హాన్‌ని స్కూల్లోకాకుండా, ఓ గుడిసెలో కట్టిపడేసేరు. కిటికీకి తీగ చుట్టేరు. ఇద్దరు మనుషులు తుపాకుల్తో కాపలాకాసేరు. రైతు సంఘం తరఫున పాయి మరోయిద్దరిని యీ పెలతో నియమించేడు.

మర్నాడుదయం రైతుసంఘం గ్రూపులన్నీ జనాన్ని మీటింగుకురమ్మని పిలిచేయి. స్కూలుగేటుదగ్గర హాన్ బంధువుల్ని, స్నేహితుల్ని అడ్డగిస్తూ తుపాకితో నించున్నాడు చావో. కుడిచేత్తో యీ పెపట్టుకుని పాయికూడా అటూ యిటూ తిరుగుతున్నాడు. స్కూల్లోంచి ఓ పెద్ద బల్ల తెచ్చి ఖాళీ జాగాలో పడేసేడు కువో. బల్ల చూపించి"ఇదే ప్రజాకోర్టు"అన్నాడు ఓల్డ్‌సన్.

జనం జట్లుజట్లుగా రాసాగేరు. కొందరు కబుర్లాడుకుంటున్నారు. మరి కొందరు గేటువేపు చూస్తున్నారు., స్తంభాలమీద, గోడలమీద నినాదాలు రాసున్నాయి ;

"హాన్ ఫెంగ్-ఛి డౌన్ డౌన్ !"

"పేదప్రజలారా, ఏకంకండి :"

"బుగతలు మన పాలిటి జెలగలు !"

"భూమీ యిళ్ళూ పంచాలి !"

"భూస్వామి హాన్ ఫెంగ్-ఛీ నశించాలి !"

సాయుధదళం హాన్‌ని తీసుకొస్తూండగా లియూ-ఫెంగ్ నినాదాలిచ్చేడు. జనమంతా గొంతులు కలిపేరు. హాన్ ప్రజాకోర్టులోకి వచ్చేసరికి జనంలో గుసగుసలు మొదలయేయి.

"ఈమారు హాన్‌కి జైలుపడతాది"

"సేతులు కట్టేసేరు, సూడు :"

"ఆడు బతుకుతాడంతావా, సస్తాడంతావా ? ఏతంతావ్ ?"

"ఆడి పాపాలపంటనిబట్టి ఆడిబతుకో సావో తేలుస్తారు."

కొందరు అంత వుత్సాహంగాలేరు. వాళ్లు హాన్ బంధువులు, స్నేహితులు కాదు. కాని వాళ్లు ఒకప్పుడు జపానోళ్ళతో మంతనాలు జరిపేరు. హాన్ తర్వాత వాళ్ళవంతు వస్తుందేమోనని వాళ్ళ భయం. కొమింటాంగ్ సైన్యంలోవున్న హాన్ కొడుకు ఎప్పటికన్నా వచ్చి పగ సాధిస్తాడేమోనని కొందరి భయం. మరికొందరికి హాన్‌కి తగినశాస్తి అవుతుందనే సంతోషమున్నా బైటపడడం యిష్టంలేక, ఏఁవీ మాటాడలేదు. బైటపడినవాళ్ళకే ముందు మూడుతుందని వాళ్ళనమ్మకం. గాలివాటు ఏటుందో గమనిస్తున్నారు. ఈ మూడురకాల మనుషులు మాత్రమే మౌనంగా వుండిపోయేరు.

హాన్ తాలూకు మనుషులు, జనం తమని గుర్తుపట్టనట్టే కూచున్నారు. ఎంతో ఉత్సాహం వున్నట్టు అందరికంటె ఎక్కువగా నినాదాలిస్తున్నారు.

ఆరోజు మీటింగుకి కువో అధ్యక్షత వహించేడు. చిన్నవాంగ్, లియూ-షెంగ్ బల్లపక్కనే నించున్నారు. పియావో మామూలుప్రకారమే దూరంనుంచీ అంతా గమనిస్తూ పచార్లు చేస్తున్నాడు.

హాన్ బల్లపక్కనే తలదించుకుని నించున్నాడు. ముఖం ఇంతకుముందుకంటె ఎక్కువగా పాలిపోయింది. అతనిచుట్టూ పిల్లలు మూగేరు, అతని నడుంకి కట్టిన తాడు చూస్తూ నించున్నారు. కొంచెం ధైర్యంగల పిల్లవాడొకడు "హాన్‌బాబూ, ఇయ్యాల నీ పొన్నుగర్రి ఏమై పోనాది?" అన్నాడు.

బల్లముందుకిరాగానే కువోకి తన చేతులు ఏంచెయ్యాలో అర్థంగాలేదు. కొంత సేపు వెనక్కి కట్టుకున్నాడు, కొంతసేపు కిందికి దించేడు, మరికొంతసేపు ముందుకి కట్టుకున్నాడు. ఎర్రబడిన ముఖంతో అన్నివేపులా పరికించేడు. అతని ముందు ఓ వెయ్యి మందిదాకా కూచున్నారు. అతనికి వాళ్ళ ముఖాలన్నీ ఓ సముద్రంలా కనిపిస్తున్నాయి. కొన్ని ముఖాలు అతన్ని గేలిచేస్తున్నట్టు కనపడ్డాయి. అతనికి దడపట్టుకుంది. అతని ధైర్యంతోపాటే వుదయమంతా కష్టపడి తయారుచేసుకున్న వుపన్యాసం కూడా ఎగిరిపోయింది.

"ఉప్పుడు మీటింగు మొదలెడదాం" అదే అతని ఉపన్యాసంలోని మొదటివాక్యం. కాని మిగిలిన ఉపన్యాసం మర్చిపోయేడు. జనం వూపిరిబిగబట్టి చూస్తున్నారు, అతను ఏంచెప్తాడా అని. ఇక అప్పటికప్పుడు కల్పించి మాటాడక తప్పిందికాదతనికి.

"నాను మీకు బాగా తెలుసు— నాను సిన్నప్పటినుంచీ కంబారోణ్ణే. సొమ్ములు కాయగల్ను, బూఁవిసాగుసెయ్యగల్నుగానీ వుపన్నాసాలయితే ఇయ్యలేను. నానుమంచి కూలీని, అంతే. కాని రైతుసంగం అందరినీ మాటాడనిస్తుంది. ఇయ్యాల మనకి హాన్‌తో బేటీ. హాన్ మనందరికీ శత్రివే. ఇయ్యాల అందరూ మాటాడాల. మనకి ఏపేటి అన్నాయాలు జరిగినాయో సెప్పాల. బయ్యంనేదు, అంతే."

హాన్ తలెత్తి చూసేడు. తాంగ్, తూ— ఇద్దరూ లేరు. మిగతా బంధుమిత్రులూ లేరు. పొడుగుమెడహాన్, లీచెన్-చియాంగ్ వున్నారుగాని కదలడానికే భయపడుతున్నటుగా కూర్చున్నారు. తన ఒళ్లు తనకి ముఖ్యం కాబట్టి వాళ్ళడిగిన ప్రతిదానికి ఒప్పుకోదలిచేడు. బల్లదగ్గరకి వెళ్ళి,

"చైర్మను కువో, ముందు నేనో రెండుముక్కలు చెప్పొచ్చా?" అని అడిగేడు.

"ఒద్దు, మాటాడనివ్వకు!" అని జనంలోంచి అరిచేడు పెద్ద లీ.

"మాటాడనివ్వండి. తప్పేటి ?" అన్నారెవరో.

"దలపోల్లు అందరినీ మాటాడనిస్తారు. ఎవరైనా మాటాడతానంటే మనమెలా ఆపుతాం ?" ఇలాఅన్న మనిషి వెంటనే జనంలో కల్సిపోయేడు.

"సరే మాటాడు" అన్నాడు కువో.

"నేను మంచోడినికాను. నాది భూస్వామ్య మనస్తత్వం. నా చిన్నప్పుడే మా అమ్మ చచ్చిపోయింది. మా నాన్న రెండోపెళ్ళి చేసుకున్నాడు. నా సవతితల్లి నన్నెప్పుడూ కొడుతూందేది..."

"నీ ఎదవకబుర్లు సెప్పమాక" అన్నారెవరో.

"అది నొల్లు కబుర్లు ఆపండి"

హాన్ మాటలు ఆపుదామని లేచేడు కువో. కాని అతన్ని ఆపేహక్కు తనకుందో లేదో తేల్చుకోలేకపోయేడు.

"మా సవతితల్లి నన్ను నానా బాధలు పెట్టేది. భరించలేక ఇంట్లోంచి పారిపోయేను, కాని రౌడీలజట్టు కట్టేను. పదకొండేళ్ళకే జూదంలో ఆరితేరేను. పదహారేళ్ళకే బజారు ముండలెంటపడ్డా."

"ఎంతమంది ముండల్తోవున్నావేటి ?" హాన్‌ని రెండుసార్లు కాపాడిన 'తెల్లమేక' అడిగేడు.

"దాదాపు డజను మందిదాకా" అన్నాడు హాన్.

మళ్ళీ మీటింగు స్వభావమే మారిపోయింది.

"తప్పులన్నీ ఒప్పుకున్నాడుగదా, మారిపోతాడులే."

"కామందు అనేగాని మంచోడే. ఉప్పుడా బూంవి కూడా ఇచ్చేసేడుగా !"

చాలామంది వెళ్ళిపోవడానికి లేచేరు. మొత్తానికి ఇంతకుముందున్న కోపం, అలజడి తగ్గేయి.

కువో కోపంగా లేచేడు.

"ఇక ఆ ఎదవ కబుర్లాపు. కొమింటాంగ్ మద్దెంతరం రాజ్జెంలో పెద్దగా నువ్వు ఏటేటి దగుల్బాజీ పనులు సేసేవో అవి సెప్పు. నీకాడ తుపాకులున్న కావలోళ్ళు వుండేవారా లేదా ?" కువో ముఖం కందగడ్డ అయింది.

"నిజంవే, కానీ అప్పుడు నేనేంచేసినా వూరిమంచికోసమే చేసేను" అన్నాడు హాన్, కువోమీదవున్న కసిని కప్పిపుచ్చుకుంటూ.

"నువ్ మాకాడ ఇరవైఆరు తుపాకులకోసం డబ్బుగుంజినావా లేదా ? అదంతా ఏటిసేసేవ్ ?"

"ఊరి రక్షణకోసం" అన్నాడు హాన్ నవ్వుతూ.

"కాని నువ్ ఆ కావలోళ్ళని నీబురుజుల్లోనే కాపలా ఎట్టేవ్. బందిపోటోల్లొచ్చినపుడు ఆల్లకీ, ఆల్లగుర్రాలకీ కూడా మేపేవ్కాదా? ఇదేనేటి వూరిరచ్చన?" గొంతు పెంచేడు కువో.

"చైర్మన్ కువో, నిజం కాదది. నువ్వు విషయమంతా పరిశీలించి, ఏం చెయ్యాలో అది చెయ్యి" తన వణుకుని కప్పిపుచ్చుకుంటూ అన్నాడు హాన్.

ఇంతలో జనంలో అలజడి రేగింది. పెద్ద లీ తన పెద్దచేతుల్తో జనాన్ని తోసుకుంటూ ముందుకి వచ్చేడు. అతని వెనకే తలపండిన తాతవచ్చేడు.

"తీన్‌తాత మాటాడతాడు" అన్నాడు లీ.

ప్రజాకోర్టు పక్కనే నించుని హాన్‌వేపు భయంభయంగాను, అసహ్యంతోను చూస్తూ గడ్డిటోపీ తీసి కిందపెట్టేడు. అతను కోపంతో వణికిపోతున్నాడు. ముడతలు పడ్డ ముఖమంతా చెమటతో తడసిపోయింది.

"బాబులూ, నాకు జరిగిన అన్నాయాన్ని మీరే మాపాల. నాకు నాయం జరిగేలా మీరే సూడాల" అన్నాడు తీన్‌తాత లియూషెంగ్, కువో, చిన్నవాంగ్‌లతో.

"నీకేటన్నాయం జరిగిందో అందరికీసెప్పు. ఆల్లంతా సబవుసెప్తారు" అన్నాడు కువో.

తీన్‌తాత ఓసారి జనాన్ని కలయచూసి, హాన్నుద్దేశించి మాటాడేడు.

"నానీవూరొచ్చి ఏడేళ్ళవుతాది.* నీకాడ యాభై సెంట్లుబూఁవి కౌలుకితీసుకున్నా. నానూ, మా ఆడదాయీ, మాయమ్మా—అంతా ఒక్కగదిలో వుండీవోల్లం. ఆపక్కన యింకోసిన్నగది వుండీది. ఆ గదులు ఎలాటివి— వొరసం కురిసినాదంటే యిల్లంతా ఒరదొచ్చినట్టు మునిగిపోయింది. ఒకపాలి నువ్వేటన్నావు?"నాకు ఇల్లు యిరుకట్టొచ్చింది. ఇల్లు కాలీసెయ్యండిమీ" అని. "నానెక్కడికి పోతానుబాబూ?" అని నానన్నాను. నీకు కోపఁవొచ్చేసింది "నువ్వెడకిపోతే నాకేటి?" అన్నావు. 'బాబ్బాబు, నానే ఓ ఇల్లు ఏసుకుంతాను. కాని జాగానేదే'అని అంటే, నువ్వెంతో మంచిగా 'జాగాకేటి, నానులేనా? సాలకాడ కొంత జాగావున్నాది. నాను అద్దెకూడా అడగను. రెండు మూడు గదులేసుకుని సుకంగా వుండండి' అన్నావు. నానెల్లి మా ఆడమనిసికి సెప్తే 'మన కామందు ఎంతమంచోడు!' అన్నాది.

"ఆ ఏడాది సలిలో కొండమీదికెల్లి దుంగలు తెచ్చేను. ముసీలి ఎద్దు, ఓ పాత బండి తీసికెల్లీవోన్ని. ఆసలిలాటలాటి సలికాదు, అప్పుడొచ్చిన సిరుసుపోటు నాకు

* 1939 లో

అర్నెల్లాగ్గనేదు. ఓ రోజు కొండమీంచి బండిలో దిగుతుంటే దాపడెద్దుకి రాయి తగిలి పడింది. దాంతో ఎద్దు, బండి—రొండూ ఓ గుంటనోకి ఎల్లిపోనాయి. నానెంతనాగినా నాబంనేకపోయింది. సివరికి మరో పదిమంది బండోలు సెయ్యేస్తేగాని అద బైటికి రానేదు. ఎద్దుకి ఓ కొమ్ము యిరిగిపోనాది''

''తీన్‌తాతా, నీ కతని తగ్గిచ్చుకాస్త'' అన్నారెవరో.

''ఎవరదీ? తీన్‌తాతా, నువ్వు కానియ్''అన్నాడు కువో.

''కలప యాపారంజేసే నీ అన్న నాదుంగలన్నీ ఒట్టుకుపోయి జపానుసైన్నానికి పొయ్యిలోకి పంపేదు— అయేదుంగలు నాను సలికాలవంతా అలాగలాగ కస్టపడి పోగేసేసినాను; మా అడమనిసి ఓ రేతిరంతా ఏడ్సినాది. రెండోఏడాది మల్ల కొండమీంచి దుంగలు తెచ్చేను. మట్టీ, ఎండుగడ్డీకూడా తెచ్చేను. మూడోఏడాది మెల్లిగా మూడు గదులు కట్టేను— కాంగూ, కిటికీలే తక్కువ. మాఁవు ముగ్గురం తూర్పునవున్న గదిలో వున్నాం. ఇంతలో నువ్ మూడు గుర్రాల్ని తెచ్చి దచ్చినానవున్న గదిలో కట్టేసేవు. 'ఈః గుర్రాలకి జబ్బుసేసినాది. సాలలో సలిగాలి తగులుతున్నాది. కొన్నాలు యీడనే వుంచండి' అన్నావు.

"నాను మూడు సలికాలాలు పాటుపడి కట్టుకున్నయిల్లు నీ గుర్రాలికి పోవాల్నా? మా యాడమనిసి ఏడుస్తూ నీ కాళ్ళమీద, నీ కొడుకుకాళ్ళమీద పడిపోనాది. 'మా కొత్త ఇల్లు పసువులసాలకింద మార్సీకండి'అని బతిమాలుకున్నాది. ఇంటో గుర్రాలెట్టుకుని ఎలా వుండాల? కాని నీ కొడుకు మా ఆడమనిసిని తన్ని తిట్టేడు "దొంగలెంజా! కుక్కల కూతురా! ఈః జాగా ఎవరిదో ఎరికెలేదేటి ఏడ్సినావంతె ఈఃడకూడా వుండనివ్వను"అన్నాడు.

తీన్‌తాత కొంచెం ఆగి, చర్మం వేలాడిపోతున్నచేతుల్తో కళ్లు తుడుచుకున్నాడు.

"నాను మూడేల్లు కస్టపడి కట్టుకున్న గూడు నీ గుర్రాలికి సాలయిపోనాది. గుర్రాల లద్దెలతో యిల్లు కంపుకొట్టీది. ఈఃగలు, దోవలు యెక్కువయి పోనాయి. తెల్లారి లెగిసీసరికి నొల్లంతా దోఁపకాటుతో వాసిపోయీది. ఏటవాలో అదే అవుతాది లెమ్మని నానూరుకున్నాను. కాని నువ్ అంతతో ఆగనేదే. ఓ రోజు నీ గుర్రాల్ని సూడనొచ్చి నా కూతురితో ఎదవ కబుర్లాడేవు. నీకు నలభై మూడేల్లయితే దానికి పదారేల్లు. దాన్ని పెల్లిసేసుకుంతానంతె అది ఒప్పనేదు. దాన్ని ఓ వామికాడికి నాక్కుపోయి, గుడ్డలు సింపేసినావ్. అది నిన్ను కరిసీస్తే నీకు కోపఁవొచ్చేసింది. 'సూద్దుగాని'అంటూ ఎలిపోనావ్. కసింతలో ముగ్గురు మడుసుల్ని తీసుకొచ్చేవు, నాకూతుర్ని

య్యరపోతే యిల్లు పీకేస్తానన్నావ్. నీ మడుసులు లోనికిపోయి నా బిడ్డని యీడుసు కొచ్చేరు..."

తీన్‌తాత పెద్దగా ఏడ్చేడు.

"ఈడి బతుక్కాల!" "ఈడి సిరసుపడ!"

"రావనాబమ్మ రాజ్జెం నసించాల"అన్నారు జనం. ముందుకి తోసుకొచ్చేరు.

తీన్‌తాత ఇంకా చెప్పేడు:

"మీరంతా దాన్ని తీసుకుపోయి పెరట్లో పొగాకుకొట్టంలో నులకతాడుతో కట్టే సేరు. అది అరుస్తుంటే నోట్లో గుడ్డముక్క కుక్కేరు. దాని గుడ్డలన్నీ ఒలిసేసి, సింతబరికతో ఒల్లు తూట్లుపడేలా కొట్టేవ్. నెత్తురు వొరదలై పారింది. అప్పుడు... అప్పుడు..." తీన్‌తాత మరి చెప్పలేకపోయేడు— గుండెలవిసిపోయేలా ఏడ్చేడు. జనం ఇంకా ముందుకి వచ్చేరు.

"తన్నో! తన్నండి! కొట్టండి!" అని అరిచేరు.

ఎక్కడినుంచో ఓ రాయి వచ్చి హాన్‌దగ్గర్లో పడింది. హాన్ ముఖం పాలిపో యింది. మెడుకులు గడగడ కొట్టుకునేలా వణుకుతూ నించున్నాడు.

"అడి గుడ్డలు ఇప్పియండి!"

"ఆడిని సంపండి!"

ఎవరోవచ్చి హాన్‌ముఖంమీద ఒక్కటిచ్చేరు. ముక్కులోంచి రక్తం కారింది.

"నా పేరు సెప్పి మరోటివ్వండి" అని అరిచేరు ఎవరో.

కాని రక్తంచూసేసరికి చాలామంది కరిగిపోయేరు, ముఖ్యంగా ఆడవాళ్ళు. ఎవరూ మాటాడలేదు. ఎవరు కొట్టింది? హాన్ తలెత్తిచూసేడు. దెబ్బ కొట్టింది లీచెన్-చియాంగ్! హాన్‌కి అంతా అర్థమయింది. నెత్తురు పెద్దబొట్లుగా పడేలా తలదించేడు. మొదట్లో జనానికి హాన్‌ని లీచెన్-చియాంగ్ ఎందుకు కొట్టేడో అర్థం కాలేదు. తర్వాత అర్థమయిందిగాని, ఏఁవిచెయ్యాలో ఎవరికీ తెలియలేదు. తీన్‌తాత ఆశ్చర్యంతో కొంత వెనక్కి తగ్గేడు కాని కువో అతన్ని ముందుకు నెట్టేడు "కానియ్ తీన్‌తాతా".

"ఇంక సెప్పాల్సింది ఏవ్నేదు" తీన్‌తాత ఎంత నిజాయితీపరుడైనా గుండె తక్కువవాడు. అతను బల్ల వెనక్కి తప్పుకున్నాడు.

లీచెన్-చియాంగ్, తెల్లమేక బల్లముందుకి వచ్చేరు.

"తీన్‌తాత నువ్వుచేసిన అన్యాయాల్ని బైటపెట్టేడు. నాకూ ఆపని చెయ్యాలని వుంది. అందుకే నిన్ను కొట్టేను. ఆదెబ్బ నీకు తగిందా, కాదా?" అని అడిగేడు లీచెన్-చియాంగ్.

"అది నాకు తగినదే"నని ఒప్పుకున్నాడు హాను.

కొందరు లీచెన్-చియాంగ్‌ని మెచ్చుకున్నారు. మరికొందరు హాన్ని మరికాస్త తిట్టేరు. కాని ఎక్కువ మంది తీన్‌తాత లాగే వూరుకున్నారు, నెమ్మదిగా పక్కకి తప్పుకున్నారు.

లీచెన్-చియాంగ్ ఇంకా ఇలా అన్నాడు:

"నువ్వు వూరిపెద్దగావున్నపుడు జపాన్ సైన్యానికి విరిగిపోయిన మలకలు కావల సొచ్చేయి, గుర్తుందా ? నువ్వు అందరి ఇళ్ళకివెళ్ళి అవి సంపాయించేవ్. అవి నాకాడ లేవు- వాటిని ఎలాగోలాగ సంపాదించకపోతే నన్ను డబ్బుకట్టమన్నావ్. ఒప్పు కుంటావా ?"

"ఒప్పుకుంటాను లీ బాబూ" అన్నాడు హాన్. ఇప్పటికి హాన్ చాలావరకు తేరుకున్నాడు. మళ్ళీ వసపిట్టలా వాగసాగేడు:

"అవును, నేను చెడ్డోడినే. 'కీలుబొమ్మ'లాటి పాడుబుర్రే నాచేత తప్పుడు పనులన్నీ చేయించింది. కాని యిప్పుడు మనది ప్రజాస్వామ్య ప్రభుత్వం. నన్ను క్షమించి ఒదిలెయ్యమంటున్నా. నేను సియావో బాబు చెప్పినట్టే నడుచుకుంటా, రైతు సంఘంకోసం ఏదైనా చేస్తాను. మిగతా సభ్యులతోపాటు విప్లవపంథాలో నడుస్తానని మాటిస్తున్నా. అలా చెయ్యకపోతే నన్ను కాల్చిపారెయ్యండి."

"అడిగిన దానికి సూటిగా జవాబుచెప్పు. నువ్వుచేసిన పనులన్నిటికీ పరిహారంగా ఏంచేస్తావ్ ? నిన్ను చితకబాదమంటావా, జరిమానా వెయ్యమంటావా ? నీ ఆస్తంతా ఇచ్చేస్తావా. జైల్లో కూచుంటావా ? వీటిలో ఏం కావాలో చెప్పు" అన్నాడు లీచెన్-చియాంగ్.

"నన్నడిగితే మీరంతా ఏంచెప్తే అదే చేస్తాను. నన్ను ఇప్పటికి మూడుసార్లు రప్పించేరు ఇక్కడికి. నా తప్పులన్నీ ఒప్పుకుంటున్నా. నాకు తగిన శిక్ష విధించండి" అన్నాడు హాన్ నవ్వు దాచుకుంటూ.

"లక్షరూపాయల జరిమానా వెయ్యండి" అన్నాడు 'తెల్లమేక'.

"మిగిలిన రెండొందల ఎకరాలను పంచెయ్యండి" అన్నాడు లీచెన్-చియాంగ్.

జనమంతా ఒక్కసారిగా మాటాడేరు. కొందరు హాన్‌ని యింట్లోంచి తరిమెయ్యమంటే, కొందరు అతన్ని జైల్లో పెట్టమన్నారు. జరిమానా కట్టి, భూమిపంచేక విడిచిపెట్టమన్నారు కొందరు. కొందరు యింకేవో చెప్పేరుగాని కొందరు ఏంవీమాటా డకుండా ఎప్పుడు బైటపడదామా అని చూస్తున్నారు. లియూ తె-షాన్ దగ్గరించేసేడు.

చావో "ఎందుకు వెళ్ళిపోతున్నావ"ని అడిగితే "రాత్రి ఎవరో చుట్టమొస్తే కలిసి బాగా తాగేననీ, తలతిరుగుతోంది, ఇంటికిపోయి నిద్రపోవాల"నీ చెప్పి తప్పించుకున్నాడు. మరికొందరు అతని వెననే ఒంట్లో బాగులేదనీ, పనుందనీ వెళ్ళిపోయేరు.

ఓల్డ్ సన్ మిగిలిపోయేడు. కాని అతనేఁవీ మాటాడకుండా ఓ మూల చతికిల బడ్డాడు. సియావో అతనిదగ్గరకొచ్చి

"నువ్వెందుకు మాటాడలేదు?" అనడిగేడు.

"నాకు మాట ఒచ్చిందికాదు"

"లీచెన్-చియాంగ్ హాన్‌ని ఎందుకు కొట్టేడంటావ్?"

"తప్పు సేసినోన్ని కొట్టద్దామరి?" అన్నాడు ఓల్డ్ సన్.

"అయితే నిజంగానే కొట్టేడంటావా?"

"సెప్పలేం. అల్లిద్దరూ ఒకటే. ఇద్దరూ 'మూడురాజ్జేలప్రేమకత'* సదివేరు. కాబట్టి ఆ దెబ్బ 'చౌయూ' తెలివిగా కొట్టేడు 'హువాంగ్‌కై' తెలివిగా తిన్నాడు."

సియావో ముందుకొచ్చి, ముందు కార్యకర్తలతోను, తర్వాత కువో, పాయి, చావోలతోను మాటాడేడు. కొంతసేపటికి కువో బల్లముందుకి వచ్చి ఇలాచెప్పేడు:

"మీటింగు అయిపోయినట్టే. మీకూ పొలంపనులుంటాయి. ఎల్లేముందు ఓ మాట సెప్పండి, హాన్‌ని ఏటి సెయ్యాల?"

"అరెస్టు సెయ్యండి" అన్నారు చాలామంది.

"లచ్చరూపాయిలూ యిచ్చేసేక, ఎవరేనా ఆడికి పూసీ వుంటే యిడిసిపెట్టె య్యండి" అన్నారెవరో.

"అంతా ఒప్పుకుంతారా?" అడిగేడు కువో

"ఒప్పుకుంతాం. పైసలు సెల్లించేక ఇంటికి పొమ్మనండి" అన్నారు చాలా మంది. వాళ్ళకీ ఇంటికి పోవాలనుంది.

"తీన్ తాతా నువ్వేటంతావ్?"

తీన్ తాత తల దించుకుని, చాలా సేపటికి

"నాకు శొప్పటానికేవీలేదు. నానూ ఒప్పుకుంతాను" అన్నాడు

---

* 14వ శతాబ్దంలో రాసిన నవల. 3వ శతాబ్దం A D లో జరిగిన సంఘటనలమీద ఆధారపడి రాసిన నవల. 'వూ'రాజ్యానికి సంబంధించిన 'చౌయూ' 'హువాంగ్‌కై' అనే సైనికాధికారిని చితకబాది, శత్రువుల్ని మోసం చెయ్యడంకోసం శత్రుశిబిరానికి పంపేడు.

# 13

మీటింగు అయిపోయేక హాన్‌ని మళ్ళీ అరెస్టు చేసేరు. మధ్యాన్నానికల్లా హాన్ అంగరక్షకుడు, లీచింగ్-షాన్ లక్ష రూపాయిలు, తూ, తాంగ్‌లు రాసిచ్చిన పూచీ పత్రాలు తీసుకొచ్చేరు. హాన్‌ని విడుదలచేసేరు.

అందరూ ఇళ్ళకి వెళ్ళేరన్నమాటేకాని ఒక్కళ్ళముఖంలోగూడ కళ, కాంతి లేవు. మీటింగుకి వెళ్ళేముందున్న సందేహాలు తిరిగొచ్చేక రెట్టింపయేయి. కొందరుపొలాలకెళ్ళే, కొందరు గుర్రాలను మేపడానికెళ్ళేరు, కొందరు గుర్రిబ్బళ్లుకట్టేరు, కొందరు గడ్డికోసేరు, కొందరు కలుపు తీసేరు, కొందరు చేపలు పట్టడానికి వెళ్ళేరు. కొందరు చిన్న చిన్న విషయాలకే ఎగిరిపడ్డారు– కుండలు బద్దలుగొట్టేరు– గుర్రాల్ని బాదేరు– వాళ్ళ ఆడమనుషులతో దెబ్బలాడేరు. మరికొందరు కాంగ్ మీద మాటాడకుండా పండుకున్నారు. వాళ్ళ బతుకుల్లో కొంత అలజడిరేగినా మళ్లీ మామూలుస్థితికి వస్తున్నట్టుగా అనిపించింది.

ఓల్డ్‌సన్ ఇంటికిపోలేదు. ఉదయం యింటినుంచి వచ్చేటప్పుడు 'ఈమీటింగుతో హాన్ అంతుతేలిపోతుంద'ని భార్యతో చెప్పివచ్చేడు. ఇప్పుడు ఇలా అవడంతో అతనికి ముఖంచెల్లక ఇంటికి వెళ్ళలేదు. కార్యకర్తలని కలవడానికి స్కూలుకి వచ్చేడు. అతను వచ్చేసరికి యిప్పటివరకు చేసిన పనుల్లో తాము గడించిన అనుభవాల్ని గురించి మీటింగు జరుగుతోంది. అయినా ఓల్డ్‌సన్ సియావోతో–

"సియావో బాబూ, నానింక 'ఆక్టివిస్ట్'గా వుండను బాబూ. ఈ పదవి నాకు పెద్దది. నాను సూసుకోలేను 'అన్నాడు.

" 'ఆక్టివిస్ట్' పదవికాదు. అతనూ మామూలు మనిషే. ధైర్యంగా ముందుకొచ్చి, పజల్ని కూడగట్టడమే అతని పని. పోనీ నువ్వు ఆ పని చెయ్యలేవంటే మానేసెయ్. దానికి రాజీనామా ఇవ్వాల్సిన పనిలేదు'' అన్నాడు సియావో.

"నానిక రాననుకోకు. మీరొచ్చినకాన్నించి మీతోనే వుంటున్నానుకానా? అడుగు ముందుకేసినంక మల్ల ఎనక్కి తీసుకోటం నానెరగను. కాకపోతే తగువేసుకున్న పెతీ మారూ మనమే వోడిపోతున్నాంకదా అనే నా బెంగంతా' అన్నాడు ఓల్డ్‌సన్.

సియావో అతన్ని ఓదార్చాలని చూసేడు. అతని స్నేహితులతోకూడా మాట్లాడి చూడమన్నాడు. ఏళ్ళతరబడిగా నాటుకుపోయిన కామందుల రాజ్యాన్ని ఒక రోజులో పెకలించడం అవదని చెప్పేడు. ఓపిక పట్టాలనికూడా చెప్పేడు.

లియూ-షెంగ్‌కికూడా ఇదంతా ఏ(వీబాగాలేదు, అయినా మాట్లాడకుండా ఏదో నవల చదువుతూ కిటికీలో కూచున్నాడు.

హాన్‌ని ఎప్పుడో కాల్చేస్తే బాగుండునని అనుకున్నాడు చిన్నవాంగ్. సియావో తో అదే అన్నాడు :

"మీరు చావోనికూడా అడగండి, ఈ మాటే అంటాడు."

"నలుగురైదుగురు అక్కివిస్టులు చెప్పింది పాటిస్తే సరిపోదు. ముందు జనం సంగతి చూడాలి. మనవైపుకి ఎంత మందిని తిప్పుకోగలిగితే మన పని అంత సులువవుతుంది. సామెత వుండనేవుందిగదా— 'పదిమందిలో చావు పెళ్ళితో సమానం' "

చిన్నవాంగ్ పూర్తిగా ఒప్పుకోకపోయినా మరి వాదించలేదు.

జనం అలా చిన్నబుచ్చుకుని వెళ్ళిపోతుంటే, అతనిక్కూడా దిగులేసింది. కాని తన భావాల్ని బైటికి చెప్పలేదు. అతను కష్టజీవి. ఓర్పుగా పనిచేస్తూ చిక్కులు తొలగించుకోవాలని గాని, కలలుకంటూ కూచోడంతోను, సొల్లుకబుర్లతోను ఏ పనీ అవదని అతనికి అనుభవం నేర్పింది. అదీగాక ఉత్సాహం పుంజుకోవడానికీ, సమస్యా పరిష్కారానికీ అతనిదగ్గరకు ఎవరైనా వస్తారు తప్ప అతని నిట్టూర్పులు, గొణుగుడు వినడానికి కాదని అతనికి బాగా తెలుసు.

ఓల్డ్‌సన్ వెళ్ళిపోయేక మీటింగు కొనసాగింది.

"పోరాటం తీవ్రస్థాయి చేరుకుంటోంది. మనం యింకా ఎక్కువగా కష్టపడుతూ, జాగ్రత్తగా వుండాలి. సెక్షన్‌లీడర్ చాంగ్! నువ్వు కాపలావాళ్ళని మెలకువగా వుండమని చెప్పు. లియూ, నువ్వు కాసేపు ఆ పుస్తకం అవతలపెట్టి లీచెన్-చియాంగ్ బృందం ఏం చేస్తున్నారో చూడు. చిన్నవాంగ్, అయిపోయిందానికి బాధపడి లాభం లేదు. చావో వాళ్ళని చూసిరా. నేను, వాన్ తీన్‌తాతని చూసివస్తాం. మీటింగులో అతని కథంతా చెప్పినట్టులేదు- ఊఁ పదండి" అంటూ సమావేశంముగించేడు సియావో.

దళనాయకుడు సియావో, వాన్ తీన్‌తాత దగ్గరకు వెళ్ళేరు. గడ్డికోస్తున్న తీన్ సియావోనిచూసి గేటుదగ్గరకు పరుగెత్తుకొచ్చేడు. అతని చెయ్యిపట్టుకుని లోపలికి తీసుకెళ్ళేడు. ఇల్లంతా కొత్తగానే వుందిగాని దక్షిణపు గదిలోంచి గుర్రపు లద్దెల కంపు కొడుతోంది. సియావో, వాన్ వెళ్ళి చూసేరు. కార్యకర్తలు యీవూరు రాగానే తీన్ తాత గదిలోంచి గుర్రాల్ని తోలుకుపోయేడు హాన్. గుర్రాలు రుద్దుకోవడంవల్ల గోడల మీద మట్టి రాలిపోయి, గడ్డి బైటపడింది. గుర్రాలు కొరకడంవల్ల తలుపులు అక్కడక్కడ గాట్లుపడ్డాయి. ఆ గదినిండా ఎక్కడచూసినా ఎండిన లద్దెలూ, ఈగలే.

మళ్ళీ కట్టనిదే ఆ గదిలో ఎవరూ వుండలేరు. తీన్‌తాతవాళ్ళు ప్రస్తుతం వుంటున్న తూర్పుగదిలోకి దారితీసేడు. కాంగ్‌మీద ఓ ఏభైఏళ్ళ గుడ్డిమనిషి కూచుంది. ఆవిడ తల నెరిసిపోయింది. కట్టుకున్న బట్ట అతుకుల బొంత. తడుముకుంటూ తాళ్ళు పేనుతోంది.

"మన్ని సూసేందుకు సియావో బాబొచ్చేడు" అన్నాడు తీన్‌తాత ఆవిడతో.

"సియావో బాబే!" గొంతు వినిపించినవేపు కాంతిలేని కళ్ళు చిట్లించిచూసింది. కాంగ్ గబగబ చేత్తో తుడ్చి సియావోని కూచోమంది.

"కూకోబాబూ కూకో. నీ రునం మాఁవు మరి తీర్సనేఁవు. నువు రావడంతోనే ఆ గదిలోఁచి గుర్రాల్ని తీసేసినాడు హాన్."

సియావో దగ్గరికి జరిగి "హాను ఓ బమ్మరాచ్చసికదా బాబూ, ఇన్నాళ్ళకి నీ సేతిలో సిక్కిపోనాడు" అంది.

ఆవిడ పక్కకి ఒంగి పుగాకు సంచికోసం తడివింది. తీన్‌తాత పొయ్యిలో ఓ తాడు వెలిగించి, సియావోకి పైపు వెలిగించుకోను ఇచ్చేడు. సియావో కొంతసేపు హాన్ గురించి మాటాడి, తర్వాత తీన్‌తాత కూతురి గుఁరించి ఎత్తేడు. తీన్‌తాత ఆ విషయంమీద యిక మాటాడవద్దని సైగచేసేడు. కాని అప్పటికే ముసలావిడ ఏడుపు మొదలెట్టింది...

"కూతురంటే కూతురుకాదు బాబూ— రాకాసిమూక— తలుసుకుంటె ఇప్పటికీ గుండె జలదరిస్తాది— అలాగ సంపీసినారు."

"సియావో బాబొస్తే ఇదేనేటి సేసేది?" అని కసురుకున్నాడు తీన్‌తాత.

ఆమె ఏడుపాపి, ఆయాసం తగ్గించుకుని,

"నాబిడ్డరాత మంచిదికాదు సియావోబాబూ. ఇంకసింత ముందే నువ్వీవూరు ఒచ్చుంటేనా— నాబిడ్డ నాకు దక్కును!"

"రండిబాబూ. అది ఏడుపునొదలె పడితే ఏడుపు ఒకంతట ఆపలేదు."

బైటికొచ్చేక మళ్ళీచెప్పేడు తీన్‌తాత "ఏడ్సేడ్సి దానికి కల్లు రొండూపోనాయి బాబూ. మూడేల్లనించి అదలాగ ఏడుస్తానే వుంది."

"ఏడ్చి కళ్ళు పోగొట్టుకుందా?"

"మరేటి, ఆడోల్లు ఏదేనా సొదుంటే తలుసుకు తలుసుకు ఏడుస్తారు. సచ్చి నోళ్ళతో సస్తాఁవా? ఇంతాచేస్తే ఓ పిల్ల"

పరధ్యానంగా బురదగుంటలో కాలేసేడు తీన్‌తాత. అతని చెప్పు బురదలో కూరుకుపోయిండి. పైకి తీసుకుంటూ నెమ్మదిగా సియావోతో "అయితే—అది ఏడించి

దంతే అలాగే ఏడుస్తాది మరి! దీనికి ముందు ఓ పిల్లాడు సచ్చిపోనాడు. ముసిల్దాయి ఆశలన్నీ ఈ కూతురుమీదే ఎట్టుకున్నాది" అన్నాడు.

"నీ కూతురు ఎలా చచ్చిపోయింది?"

"అలాగ వుత్తరంకేసి నడుబాబూ" అన్నాడు తీన్ సియావోపూట దాటేస్తూ.

ఊరి పొలిమేరల్లోకిరాగానే వాన్ తుపాకి సిద్ధంచేశాడు.

"మరేం బయంనేదు లేరయ్యా. బందిపోటోల్లు తాచింగ్ కొండల్లోకి పోనారు. మా బిడ్డని పాతిపెట్టినసోటు సూపుదునా సియావో బాబూ? ఈడనే. గేటుకాడవున్నాది" అన్నాడు తీన్‌తాత.

సాయంత్రిం ఎండపడి ఏటిలో అలలు తళతళ మెరుస్తున్నాయి ఏటికి రెండు వేపుల రెల్లుగడ్డిలేచింది. కలువలు వికసించేయి. నీటి పిట్టలు ఏటిఒడ్డుమీంచి పైకి లేచి, మళ్ళీ కిందికి దిగుతున్నాయి. ఏటికి ఉత్తరాన పండిన మొక్కజొన్న చేలు గాలికి వూగుతున్నాయి. పెద్దపెద్ద పొద్దుతిరుగుడు పూలు తూర్పువేపు తిరిగున్నాయి. ఓ చిన్న దిబ్బమీద గడ్డి మొలిచింది. అదే తీన్ కూతురిని పాతిపెట్టినచోటు.

వాళ్లు గడ్డిలో కూచున్నారు. తీన్‌తాత కూతురి సంగతి మళ్లా ఎత్తేడు హాన్ ఆ పిల్లని పందిరిగుంజకు కట్టేసి, గుడ్డలు వూడదీయించి, చర్మం తూట్లుపడేలాకొట్టేడు ఆ పిల్లచేత ఆవిడ కాబోయే మొగుడు జపానోళ్ళ వ్యతిరేక సైన్యం[1] లో వున్నాడని చెప్పించాలనుకున్నాడు హాన్. కాని ఆ పిల్ల ఒక్కముక్కకూడా బైటపెట్టలేదు.

"అతను నిజంగానే ఆ సైన్యంలో వున్నాడా?"

తీన్‌తాత అటూయిటూ చూసి నెమ్మదిగా "అతను అందులోనే వున్నాడని దానికి తెలుసు. సవ్వనన్నా సచ్చేదిగాని అతన్ని బైటపెడతాదా?" అన్నాడు

"అతని పేరేంటి? మరేం భయంలేదు. మా ఉమ్మడి ప్రజాసైన్యం[2], వాళ్ళ సైన్యం ఒకటే"

"అతనిపేరు చాంగ్ తీన్-యువాన్. నాబిడ్డని ఎంత కొట్టినా అతన్ని గురించి ఒక్కమాట బైటపెట్టనేదు. మద్దిరేతిరిదాకా అలాదాన్ని బాదుతూనే వున్నారు. సివరికి నెత్తురు కక్కుకుని మరోరొండు వోరాలకి సచ్చిపోనాది."

"చాంగ్ తీన్-యువాన్ ఎక్కడున్నాడిప్పుడు?"

"తెల్దుబాబూ. ఆరేతిరే మా పిల్ల సెప్పింది 'అతన్ని పారిపొమ్మనిసెప్పు' అని. పెద్దగోడకి[3] దక్సినానికి ఎల్లేడు. ఇంతవరకు జాడేనేదు"

---

1. Anti Japanese Amalgamated Armies
2. United Democratic Army
3. Great Wall

ముగ్గురులేచేరు. సమాధిముందు నించుని, గౌరవపూర్వకంగా వందన సమర్పణ చేసేరు.

"నీ కూతురు చాలా మంచిపిల్ల. నువ్వు తప్పకుండా పగతీర్చుకోవాలి. భయ పడకు" అన్నాడు సియావో నడుస్తూ.

"నాకేం బయంనేదు బాబూ" అన్నాడు తీన్‌తాత.

వంటవేళయింది. ఇళ్ళల్లోంచి పొగవస్తోంది సియావో స్కూలుకొచ్చేసరికి స్కూల్లో చిన్నవాంగ్, చావో, మిగిలినవాళ్ళు అతనికోసం చూస్తున్నారు.

చిన్నవాంగ్ మధ్యాన్నం చావోని కల్సుకోడానికి వెళ్ళినపుడు అక్కడ కువో, పాయి, పెద్ద లీ, చిన్నయాంగ్‌కూడా కనిపించేరు. చావో చుట్టకాల్చుకుంటుంటే మిగి లినవాళ్ళు మీటింగు గురించి మాటాడుకుంటున్నారు. చిన్నవాంగ్‌ని చూడగానే అందరు లేచి నిలబడ్డారు.

"మీరుకానివ్వండి, నేనిక్కడ కూచుంటా"నని కాంగ్‌మీద కూచున్నాడు చిన్న వాంగ్.

"హాన్ తాలూకోల్లు మీటింగెట్టుకున్నారు."

"ఎవలెవలు?" అడిగేడు పెద్ద లీ.

"నీకు తెలీదేటి?"

"లీచెన్-చియాంగేనా?"

"ఆఁ, ఆడిదెబ్బే హాన్‌కి పేనాలు దక్కించినాది."

"ఆ తెల్లగడ్డపోడు మల్లావచ్చాడు. ఎవడేటి?"

"హాన్‌కి దూరపుచుట్టం. పేరు 'హూ'. మనూరికి వుత్తరాన వుంతాడు."

"వాంగ్‌బాబూ, హాన్‌గాడి నెలాపట్టాల? జనం ఇంకా జిలవకున్నారు" అన్నాడు పెద్ద లీ.

"మనం స్కూల్లో మీటింగుపెట్టుకుందామా?"

సరేనని బయల్దేరేరందరూ.

సియావోతో అర్ధరాత్రివరకు మాట్లాడి, కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు.

ఒకటి- రైతుసంఘం వీలైనంత ఎక్కువమంది పేదవాళ్ళని సభ్యులుగా చేర్చు కుని రహస్యంగా సమావేశమై, హాన్‌ని ఎలా ఎదిరించాలో చర్చించాలి.

రెండు— హాన్ మనుషుల ఆనుపానులు కనిపెడుతుండాలి.

మూడు— ఓ సాయుధదళాన్ని తయారు చేసుకోవాలి.

ద్రోహుల్ని ఏరిపారేసే కమిటీకి పెద్దలీ పెద్దఅయేడు. పాయి సాయుధదళం పెద్దగానేవున్నాడు. లియూ తెషాన్-ని పుత్పత్తి కమిటీనుంచి తీసేసేరు. కాని ఆ ఖాళీ అలాగే వుంచేసేరు—అప్పుడే ఉత్పత్తికి తొందరలేదు.

"జనంవైతే వున్నారుగాని, ఆలకి ఆయుధాలు ఏడనించొస్తాయి?" సాయుధ దళాధిపతి హోదాలో అడిగేడుపాయి.

"మేం ఒక తుపాకిమాత్రం ఇవ్వగలం. మిగతావి యింకెక్కడన్నా చూసుకో."

చావో పెద్ద లీని ఇనుముకొని ఈటెలు చెయ్యమన్నాడు. హాన్ జరిమానడబ్బు వుండనేవుంది. పెద్దలీ ఆ రాత్రే పని మొదలెడతానన్నాడు.

వాళ్ళు ఇళ్ళకీ పోయేందుకు లేచేసరికి అంతావెన్నెలే. తెల్లవారేవరకు పెద్దలీ ఈటెలు చేస్తూనేవున్నాడు.

పగలు చెట్ల నీడలలోను, పొలాలలోను, కూరగాయ తోటల్లోను, ఏటిఒడ్డునా జనం గుంపులు గుంపులుగాచేరి నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు. పొద్దుపోయేక ఇంట్లోనే చిన్నచిన్న జట్లుగా కూడుతున్నారు. ఎవరైనా వస్తున్న అలికిడయితే-అంతా నిశ్శబ్దం! ఇవి ఆక్టివిస్టులు నడిపే మీటింగులు. తమ జీవితాల్లో భా మైపోయిన ఈ మీటింగుల్లో జనం తమ బాధలు చెప్పుకునేవారు. అన్నీ చర్చించుకోవడంవల్ల, ఒకరు చెప్పేది అందరూ అర్థంచేసుకోవడంవల్ల అంతా దగ్గరయేరు. అందరూ హాన్‌ని ఎదిరించేందుకు సిద్ధమవుతున్నారు.

రోజూ జరిగినవన్నీ ఆక్టివిస్టులు రిపోర్టుగారాసి సియావోకిపంపేవారు. సియావో వాటినిచూసి, గ్రూపులన్నిటికి తీర్మానాలు పంపేవాడు.

హాన్‌కి యీ విషయాలేమీ తెలీవు.

లీచెన్-చియాంగ్ వాళ్ళంతా ఏంచేస్తున్నారో చూసిరమ్మని సియావో లియూ-షెంగ్‌ని పంపేడు. మీటింగుహాలు కిటికీలోంచి చూస్తే పొడుగుమెడ హాన్, లీచెన్-చియాంగ్, తెల్లమేక కనిపించేరతనికి. అతను కనపడగానే హడావుడిగా లేచినించుని నవ్వుతూ పలకరించేరు. వాళ్ళతో కొంతసేపు మాటాడి, లియూ-షెంగ్ వచ్చేసి సియావోకి చెప్పేడు.

విషయమంతా చర్చించేరు కార్యకర్తలు.

"హాన్ పూరిపెద్దగా వుండేటప్పుడు ఆ హాలులో కొమింటాంగ్ పార్టీ బ్రాంచి వుండేది. అంతకుముందు కీలుబొమ్మ మంచుకోరాజరికం తాలూకు కమిటీ వుండేది. అప్పుడు పొడుగుమెడోడు, లీచెన్-చియాంగ్ ఆ కమిటీ కోసం శానా పనిచేసేవోరు" అన్నాడు పెద్ద లీ.

"మరి తెల్లమేకో?"

"ఆడు ఎక్కువ ఎల్లీవోడు కాదుగాని ఆడు ఆల్ల ముటాలోవాడే. ఆల్ల మీటింగులకి ఖూడూ ఎల్లీవోడు."

"వాళ్ళమీద ఓ కన్నేసి వుంచాలి'' అన్నాడు సియావో.

వాళ్ళని కనిపెట్టేందుకు మనుషుల్ని పంపేడు లీ. అందువల్ల హాణ్ణ మనుషులకి ఏం చెయ్యాడానికీ వీలుగాకుండాపోయింది. హాణ్ణకి ఒక్కసారి చేతులు కాళ్ళు విరిచేసి, కళ్ళు పీకేసి, చెవులు కోసేసినట్టయింది. అతని కాళ్ళకింద నేల కదిలిపోతున్నట్టుంది. అతని కోట బురుజులు ఫెళఫెళ విరుగుతున్నట్టుంది. అతనెప్పుడు ఇంత కంగారు పడలేదు. రాత్రులు నిద్రపట్టక కొట్టుకునేవాడు. తెల్లవార్లూ జాగారమే.

## 14

ఆషాఢం ఆఖరికి నాట్లు అయిపోయేయి. వర్షాకాలం మొదలయింది. కోతలు కోసే లోపల ఇళ్ళు: ధాన్యపు కొట్లు బాగుచేసుకోవడం, గడ్డికొయ్యడం లాంటి పనులు రైతులు పూర్తిచేసుకున్నారు. హాన్ వ్యతిరేక పోరాటానికి కొంత సాయంచేసినా వాళ్ళలో ఆ హుషారు పోయింది. ఇళ్ళలోజరిగే చిన్న మీటింగులుకూడా ఆగిపోయేయి. ఎటూ తేలని రాజకీయ పరిస్థితి, హాన్ మనుషులు వేసే పుకార్లు రైతులమీద పనిచేస్తున్నట్టున్నాయి.

ఎన్ని యిబ్బందులొచ్చినా వీలైనంతతొందరగా భూమి పంచమని భూసంస్కరణ కార్యకర్తలను జిల్లా పార్టీ కమిటీ ఆదేశించింది కార్యకర్తలు రాత్రింబగళ్ళు పని చేస్తూనే వున్నారు. సియావో ఎంత హుషారుగావున్నా పనిఒత్తిడివల్ల చిక్కిపోయేడు. గడ్డంకూడా బాగా మాసింది.

"మనం ఇక హాన్, తు, తాంగ్ లాటి భూస్వాముల భూమి, గుర్రాలు, ఎడ్లు జప్తుచేసుకోవచ్చు. బీదవాళ్ళకి ఎంత ఎక్కువపంచితే అంతమంచిది. తొందరగాచేస్తే మరీ మంచిది" అన్నాడు సియావో.

"ఇంకా కోతలు కాని బూఁవిని ఏంచెయ్యాల?"

"ఆ భూమి ఎవరికొస్తే, పంటకూడా వారిదే."

భూమి పంపకం కమిటీ ఏర్పడింది. ఉన్న భూమినిబట్టి, జనాభానిబట్టి ఒక్కొక్కరికి ఓ ఎకరం వస్తుంది. గుర్రాలున్న వాళ్ళకి దూరపు పొలాలిచ్చేరు.

కమిటీని అయిదు జట్లుగా విడగొట్టేరు. అన్నిట్లోకి కువో జట్టు బాగాపనిచేసింది. అతని జట్టులోవాళ్ళు భూమి పంచగానే తమ వాటా చుట్టు సరిహద్దుగా కర్రలు పాతాలి. మొదట ఇది ఎవరికీ నచ్చలేదు.

"కర్రలెందుకు పాతడం? అంతా ఒక వూరోళ్ల మేగదా? ఎవరి పొలమేదో తెలీదా?" అని భూమి పంచడమే నచ్చని ఓ పెద్దమనిషి అన్నాడు.

"కర్రిలు పాతాల్సిందే. లేకపోతే పంటలకాడ తగువొస్తాది" అన్నాడు కువో. కువో, అతని మనుషులు అయిదురోజులు కష్టపడి నేలసారాన్నిబట్టి వాటాలేసి, కర్రలు పాతేరు. ఇంకా కోతకురాని పంటకూడా పంచేరు.

*కంబారి"చూ" భూమి తీసుకోడానికి ఒప్పుకోలేదు. కువో తన పనంతా మాను కుని ఓ సాయంత్రిం అతనితో మాటాడేడు. చివరికి చూ తన భయాన్ని కనబరిచేడు.

"నాకూ బూఁవి కావాలనేవుంటాది. బూఁవి పేనంతో సమానంగదః కాని నాకు బయ్యంబాబూ..."

"బయం ఎందుకూ?"

నానుపుట్టి బుద్దెరిగి ఎన్నడూ అబద్దవాడ్నేదు. ఈ దలపోల్లు కొసంటా మనూల్లో వుండరేమోనని నా అనుమానం. మల్లొచ్చి కుమింటాంగోల్లు మన బుర్రిలు ఎగరేసుకు పోతారని...".

"నీకేం బయంనేదు. దలపోల్లు ఎల్లిపోతే నన్నడుగు" నమ్మకంగా చెప్పేడు కువో.

"నీకాడకి రావాల్నాబాబూ? నీతల ఎగిరిపోతాదని నీకుమాత్రం బయంనేదేటి?" నవ్వుతూ అడిగేడు చూ.

"నాకాడికేరా. మిగిలిన బీదాబిక్కీనికూడా సాయమడుగుతా. కలిసికట్టుగా ఒకరి నొకరం ఆదుకుంటావుంటే మనరైతుసంగం వుక్కు గొట్టంవంత గట్టిగావుంటాది. అప్పుడు మనకి బయమేనేదు చైర్మన్ మావో ఏటంటాడో ఎరికేనా– 'పేదోల్లుపేదోల్లు కలిస్తే రాజ్జాలే పడగొట్టచ్చు'అని. కొమింటాంగోల్లకంటె మనమే బలంగా వున్నాం. మల్లా రాడానికి అల్లకి దమ్ములున్నాయేటి? ఒక్కడొచ్చాడా ఒక్కడే దొరికిపోతాడు. ఇద్దరొచ్చారా జోడతా దొరికిపోతారు. ఎనిమిదోదలపోల్లు* గోడపైట జపానోల్లని ఇలానే ఓడించేరని సియావోబాబు సెప్పేడు".

'చూ' కి యింకా నమ్మకం కుదరలేదని కనిపెట్టేడు కువో.

---

* పూర్తి పేరు 'చూ ఫూ-లిన్'

* గోడ = Great wall.

"దలపోల్లు ఎప్పటికంటెకూడా కానా బలంగున్నారు"అన్నాడు. చూ ఎంతో ఆసక్తిగా "ఎంతబలంగున్నారు?" అనడిగేడు.

" 'గోడలోపల, బైట ఇరవైలచ్చల మందిని మావో వుంచేడ'ని సియావో బాబన్నాడు."

"నిజఁవే? అయితే నాకూ బూఁవి కావాల. మాఁవు ఆరుగురం. నాకు మంచి బూఁవి ఆరు ఎకరాలిప్పించుబాబూ."

"ఇప్పిస్తాకాని మంచిబూఁవి ఎక్కువనేదు"అన్నాడు కాని ఎలాగో తంటాలు పడి అతనింటిదగ్గర్లోనే ఓ చెక్క అతనికి ఏర్పాటుచేసేడు.

తర్వాత ఎప్పుడో భూమి పంపకపు అనుభవాలుచెప్తూ "కువో పనిచేయడంతో పాటు జనానికి నచ్చచెప్పగలడు. అతని విజయానికి అదే కారణం"అన్నాడు సియావో.

యాంగ్ జట్టు పద్ధతి మరోలావుంది. అతని బట్టలకొట్టు వెనకవున్న గదిలో ముప్ఫైమందిదాకా కూడేరు. అందరిదగ్గర సరిహద్దులకోసంతెచ్చిన కర్రలున్నాయి.

"ఒకొక్కల్లకి ఎకరంబూఁవి ఇస్తన్నారు కార్యేకర్తలు. మీకెలాటి బూఁవి కావాలో సెప్పండి."అన్నాడు యాంగ్.

ఎవరూ మాటాడలేదు.

"ఏటి, మాటాడరు? మీ జఁవ్వలు పడిపోనాయేటి?" నోరు వంకరగాపెట్టి కోపంగా అడిగేడు యాంగ్.

కొంత సేపటికి ఓ ముసలతను "కార్యేకర్తలు మాకు బూఁవి వూరికే ఇస్తన్నారు కదా, మరి మాఁవేటి అడుగుతాం? నువ్వేటిస్తే అదే ఉచ్చుకుంతాం" అన్నాడు.

"ఉప్పుడిలానే అని, తర్వాత నన్ను ఏటైనా అంతే...?"

"నిన్నెవ్వరేటీ అనరు బాబూ. మాఁవు బూఁవి సూడాల్సిన అవుసరఁవూ నేదు, కర్రలూ పాతం."

"యాంగ్ బాబూ, నీకేటి తోస్తే అదేసెయ్యి."

"నామీద మీకు నమ్మకముంటేసరే. గుర్రాలున్నోలకి దూరాన మడిచెక్కలిస్తాం"

"నీ యిస్టం బాబూ"

"బూఁవితోటే పంట వస్తాది. మరి తగవులుండకూడదు."

"అందరం ఒక వూరోల్లమేకదా. తగవెందుకు?"

"మరైతే అంతా కుదిరిపోనాది. మీటింగు అయిపోనాది. ఎల్లి మీపనులు సూసుకొండి" అన్నాడు యాంగ్.

"యాంగ్ బాబుకి అన్నీ తెలుసు."

ముప్పైమందీ వెళ్ళిపోయేరు. వాళ్ళు విడిచిపెట్టిన కర్రలు కొట్లో నిప్పుకి పనికొచ్చేయి.

ఆరాత్రి... కొట్టు మేనేజరు చాంగ్ ఫూ-యింగ్‌తో కలిసి యాంగ్ ఓ లిస్టు తయారుచేసేడు. ఎంతమంది వున్నారో, పంచడానికి ఎన్ని మడిచెక్కలున్నాయో లెక్కరాసేరు. అర్ధరాత్రి వరకు లాంతరు వెలుగులో చాంగ్ గిలికేడు. మర్నాడు ఆ లిస్టు సియావోకి చూపించి,

"నా పనయిపోనాది. ఎవరికేటి రావాలో అంతా యిందులో వుంది" అన్నాడు యాంగ్.

"చాలా తొందరగాచేసేవే!'' యాంగ్ నడింపాపిట చూస్తూ సియావో అన్నాడు. కాని లిస్టు చదివి, కళ్ళు చిట్లించి

''ఇది భూమి పంపకంలా లేదే, ఏవో జమ, ఖర్చు వేసినట్టుంది. ఇదంతా నువ్వే రాసేవా?'' అన్నాడు.

"నానూ, చాంగ్ ఫూ యాంగ్ కలిసి రాసేం''

"నీకు రాయడం ఒచ్చా?''

''అంత బాగా రాదుబాబూ''

"చాంగ్ చింగ్-సియాంగ్- ముగ్గురు సభ్యులు- భూమిలేదు- గుర్రంలేదు- వూరుకి దక్షిణానవున్న మూడెకరాలు వస్తాయి- ఇది లోగడ హాన్ భూమి" అంటూ లిస్టు చదివేడు సియావో.

"చాంగ్ చింగ్-సియాంగ్‌ని తీసుకురా"అన్నాడు.

"నాపని అయిందిరాబాబూ"అనుకుంటూ వెళ్ళిపోయేడు యాంగ్. కాని చెప్పింది చెయ్యక తప్పదుగనక చాంగ్‌దగ్గరకు వెళ్ళి "నువ్వు సియావో బాబుకాడ కర్రలసంగతి ఎత్తకు"అన్నాడు.

"నీకెందుకుబాబూ, నానేటీ సెప్పను". యాంగ్ లోగడ తన పొరుగునే వుండ డంవల్ల, భూమి పంపకపు కమిటీలో వుండడంవల్ల చాంగ్‌కి అతనంటే చాలాగురి.

"బాబూ, తమ దయవల్ల ఇప్పుడూ నాకు బూఁవి వున్నాది. మా తాత ముత్తా తలనాడు కుంటనేల నేదుమాకు. ఇప్పుడు ఐదెకరాల బూఁవి వున్నాది" అన్నాడు యాంగ్ సియావోతో.

"మంచినేలేనా?"

"అబో, కాన్నామంచిది."

"ఎక్కడుంది? మీ ఇంటికి ఎంతదూరం?"

"శానా దగ్గరబాబూ. రొండడుగులేస్తే అందుతాది"

"సరిగ్గా ఎక్కడుందోచెప్పు. ఇంతకుముందు ఎవరిదానేల?"

"ఉత్తరానవున్న గేటుబయట బాబూ. అది 'తూ'ది."

సియావో నవ్వాపుకుంటూ యాంగ్ ఇచ్చిన లిస్టుతీసి చదివేడు:

"చాంగ్‌కి మూడెకరాలు– వూరికి దక్షిణాన– ఇంతకుముందు హాన్‌ది."

అందరూ గొల్లుమని నవ్వేసరికి చాంగ్ బెదిరిపోయేడు. కాని సియావోకూడా నవ్వడంచూసి, తనమీదికి ఏమీరాలేదని అంతా చెప్పేసేడు:

''నాతప్పేట్నేదు బాబూ 'సియావోబాబుకి కర్రల సంగతి సెప్పకు' అని యాంగ్ సెప్పేడు'' వెనక్కి తిరిగి ''యాంగ్‌బాబూ, యాంగ్‌బాబూ'' అని పిలిచేడు.

''వెళ్ళిపోయేడ''ని చెప్పేడు వాన్.

''యాంగ్ తప్పుకుని, నన్ను సిక్కుల్లో ఒగ్గిసినాడు. సరే సియావోబాబూ, నువ్ నాకు ఏ సిక్చ ఏసినాసరే.''

''నీ తప్పేంలేదు నువ్వు వెళ్ళొచ్చు. ఎటొచ్చీ మీసెక్షన్‌లో భూమి మళ్ళీ పంచాలి. వాన్, యీ సెక్షన్ సంగతి చావోనే చూడమని చెప్పు'' అన్నాడు సియావో లిస్టు పక్కనపెట్టేస్తూ.

అప్పుడే వచ్చిన ఓ ముసలతన్ని ''నీకేంకావాలి బాబూ?'' అని అడిగేడు.

''కారెకర్తలు ఎల్లిపోతారని సెప్పుకుంతన్నారు. సూసిపోదాఁవని ఒచ్చేను బాబూ''

''నీకెవరు చెప్పేరు?''

''అంతా అనుకుంటున్నారు బాబూ''

''మేం ఎక్కడికీ వెళ్ళడల్లేదని అందరికీ చెప్పు. ఎనిమిదో దళం కూడా ఎక్కడికీ పోదు. ఈ వూళ్ళోని కామందుల్ని తుడిచిపెట్టేవరకు మేం ఎక్కడికీ పోం. ఎవరినీ లేనిపోని భయాలు పెట్టుకోవద్దని చెప్పు తాతా.''

ముసలతను వెళ్ళిపోగానే చావో వచ్చేడు.

''యాంగ్ బూఁవి పంచడఁవంతా తప్పే. అతని జట్టు కర్రలు పాతనేదు. అతనుసేసిన పనికి అతన్ని తీసెయ్యాలని రైతు సంగం తీర్మానించింది. కాని యాంగ్ ఏడ్చేసినాడు. మరెప్పుడూ ఇలాటిపని సెయ్యనన్నాడు. మరిప్పుడు ఏటి సెయ్యాల?'' అన్నాడు చావో సియావోతో.

"రైతు సంఘం మీటింగులో ఎక్కువమంది ఏమన్నారు?"

" 'యాంగ్ ఇంతకుముందు రైతుగదా, ఈమారు అతన్ని ఒగ్గేసి, మరెప్పుడూ తప్పుసెయ్యకుండా సూద్దాం' అన్నారు."

"సరే, ఈసారికి ఒదిలెయ్యండి. నువ్వతనికి సాయంచేస్తూండు. ఇంతకీ నీవాటా తీసుకున్నావా?

"నాను వొప్పుకుంటే మిగతావోల్లని ఎలా ఒప్పిస్తానుబాబూ?"

"అయితే కొమింటాంగ్ సైన్యమొచ్చి నీతల నరికేస్తుందన్నభయం నీకు లేదన్న మాట"

"ఎవరు ఎవరిపీక తెగ్గోస్తారో సూడాల" అంటూ తుపాకిని కిందకి గభాల్న దించేడు చావో "కొమింటాంగోల్లనీ, ఆల్లని నడిపే అమెరికావోల్లనీ రావడమయితే రానిస్తాంగాని ఇదుండగా పేనాలతో ఇడిసిపెట్టం" అన్నాడు.

"ఇవాళ నీకేమైనా పనుందా?" అన్నాడు సియావో.

'ఏంపనిలేద'ని చెప్పేక, వాన్‌ని అక్కడేవుండమని, సియావో, చావో బయటకు నడిచేరు.

ఇద్దరూ వీధిలో చెట్లనీడన నడవసాగేరు. ఆకుల్లోంచి ఎండ చిన్నచిన్న బంగారు చక్రాల్లా పడుతోంది వానాకాలంపోయి, శీతాకాలం వస్తోంది– ఈశాన్య చైనాలో ఈ కాలం చాలా బాగుంటుంది– మరీ అంత చలిగానూవుండదు, అలాగని వేడిగానూ వుండదు. అక్కడక్కడా యింకా పచ్చగానేవుంది. జనానికి పనితొందరలేదు. తుపాకి బుజంమార్చుకుని తమ నాయకుడి పక్కనే నడుస్తున్నాడు చావో. రోడ్డువార చిన్న *ఎర్రటి పళ్ళున్నపొదలు కనిపిస్తే కోసుకొచ్చేడు.

"కోతలరోజుల్లో ఈ పళ్ళు శానా బాగుంటాయి"

అవి చాలా పుల్లగావున్నాయి. వాళ్ళిద్దరూ మాట్లాడుతూ నడిచేరు.

" *దాక్షపల్లు ఇంకా పుల్లగావుంతాయి. మంచుకో పెబుత్వంలో ఈ పళ్ళకి పన్ను పళ్ళల్లోనే కట్టాలి."

రోడ్డుపక్కనున్న తెల్లటి బాతులు, నల్లటి బాతులు వీళ్ళనిచూసి మెడలుసాగదీసి 'క్కె-క్కె-క్కె' అంటూ అటూయిటూ తిరిగేయేగాని భయపడి చెదిరిపోలేదు. ఓ బాతు దాని ఎర్రటి ముక్కుకి అంటుకున్న ఆకుని ఎలాగైనా తీసేసుకోవాలని తిప్పలుపడుతోంది.

---

* Crab apples

* Black currants

నూతిదగ్గర గుర్రానికి నీళ్ళుపెడుతున్న మనిషెవరో గిలక తిప్పుతూ చావోని పలకరించేడు. చావోకూడా నవ్వుతూ సమాధానమిచ్చేడు.

సియావో. చావో ఇంకా ముందుకి నడిచేరు, లేతకొమ్మలమీద పిచికలు వూగుతున్నాయి. మధ్యాహ్నం వంటలుచేసుకుంటోంటే ఇళ్ళల్లోంచి వచ్చేపొగ చెట్లవెనకనించి కనిపిస్తోంది. అక్కడక్కడ కోళ్ళు కూస్తున్నాయి గడ్డిగాదం వేసుకొస్తున్న ఓ గుర్రబ్బండి ఎదురొచ్చింది. గడ్డిపైన పిటపిటలాడుతున్న బస్తాలున్నాయి.

"మొక్కజొన్న పొత్తులు తీసుకోబాబూ" అంటూ ఆ రైతు బండి ఆపేడు. ఓ బస్తాలోంచి పది పొత్తులుతీసి చావోకిచ్చేడు. బండి ఆగేసరికి, బండివెనకాలేవస్తున్న గుర్రప్పిల్ల దాని తల్లిదగ్గరకెళ్ళి పాలుతాగింది.

రోడ్డుకి అటుయిటు పొద్దుతిరుగుడుపూలు చిక్కడు పందిళ్ళ మీదనుంచి కనిపిస్తున్నాయి. ఇద్దరూ ఓ తోటలో కట్టెల మోపులమీద కూచున్నారు. అక్కడే మొదటిసారిగా సియావో చావోని పార్టీలో చేరమని అడిగేడు. ఆ విషయమె చాలా సేపు మాట్లాడుకున్నారు.

చావోకి ఆరాత్రి నిద్రపట్టలేదు. కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు కాబోతున్నాడన్న ఆనందం పట్టలేకపోయేడు. కాంగ్‌మీద అటుయిటు దొర్లుతుంటే, అతని భార్య లేచింది.

"నిద్రపోవేటి ? ఏటయినాది ?"

చావో ఏఁపీచెప్పలేదు. ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి. ఇంకా మంచు కురుస్తూనేవుంది. అప్పుడే తుపాకీ పట్టుకొని సియావోదగ్గరకి బయలుదేరేడు చావో అతనికొక అప్లికేషనిచ్చేరు. చావో యు-లిన్ ఓ పేదరైతు ఇప్పుడు చైనా కమ్యూనిస్టు పార్టీలో ప్రొబేషనరీ సభ్యుడయేడు. మరో మూడునెలల తర్వాత సభ్యుడవుతాడు. అప్లికేషనుమీద చావోగురించి ఇలా రాసేడు సియావో :

"ఓ పేదరైతు. నమ్మకస్తుడు, బాగా పనిచేస్తాడు. కార్మిక కర్షక విముక్తి కోసం ఏ త్యాగానికైనా సిద్ధమే"

తర్వాత కువో, పెద్దలీ, పాయికూడా పార్టీలో ప్రొబేషనరీ సభ్యులయేరు.

(సశేషం)

# విప్లవ మేధావి పాత్ర

చారుమజుందార్

రెండు వందల సంవత్సరాలకు పైగా సామ్రాజ్యవాదం దోపిడీకి గురిఅయిన మన దేశంలో, మేధావులు చాల ప్రముఖమైనపాత్ర నిర్వహించాల్సి వున్నది. మనదేశంలో అసంఖ్యాకమైన పేదప్రజలు భూమిలేని రైతులు రాయనూ, చదువనూ రానివాళ్ళు గనుక యీ అవసరం యింకా బలీయమవుతున్నది. కాని విప్లవ రైతాంగ పోరాటాన్ని అభివృద్ధి చేసి, పోరాటంలోకి స్థిరత్వాన్ని, దృఢత్వాన్ని తేవాలంటే పేదకూలీ రైతుల్లో 'చైర్మన్ మావో సూక్తుల'ను వ్యాప్తిచేసి ప్రచారం చేయడం చాల అవసరం. 'నిరంతరం మననం చేయాల్సిన మూడు రచనలు' వాళ్ళు మళ్ళీమళ్ళీ గ్రహించి వాటినుంచి పాఠాలు తీసుకొనేటట్లు ప్రతిరోజూ 'క్రమశిక్షణకు సంబంధించిన మూడుప్రధానసూత్రాలు' 'గమనించవలసిన ఎనిమిది అంశాలు' చదువుకోవడంలో పోరాట యోధులకు సాయపడాలి. ఇవ్వాళ యీ కర్తవ్యాన్ని మేధావులు చేపట్టాల్సి వున్నది. పేదరైతుల పోరాటాన్ని అభివృద్ధి పరిచేవిగా మాత్రమే యీ రచనలను తీసుకోకూడదు. విప్లవాన్ని కాంక్షించే ప్రతివాడు— కార్మికుడుగాని, రైతుగాని, పెటీబూర్జువా వ్యక్తిగాని, వాటిని తప్పకుండా మళ్ళీమళ్ళీ అధ్యయనంచేసి వా[illegible]ంచి పాఠాలు తీసుకోవాలి. ఈ పద్ధతిద్వారా మాత్రమే పోరాటంలోవున్న ప్రజల రా[illegible]తన్యస్థాయి పెంచబడుతుంది. మన జీవితంలోని అనుభవాలకు జోడిస్తూ మనం ఎప్పుడూ కొత్తపాఠాలు నేర్చుకుంటుంటాం, మన చైతన్యాన్ని పెంచుకుంటుంటాం. అందుకని, విప్లవకారులు చదువాల్సినవి యివే. విప్లవ మేధావులు యీ రచనల ప్రాముఖ్యాన్ని గుర్తింపచేసే బాధ్యతను వహించి వాటినుంచీ పాఠాలు నేర్చుకోవాలనే తపనను రైతుకూలీ జనంలోనే కాకుండా యితర విప్లవ వర్గాల్లోకూడ కలిగించాలి. ఈ మార్గంలో పనిచేయడం వల్లనే మావో ఆలోచనా విధానాన్ని సృజనాత్మకంగా అన్వయించి మంచి కమ్యూనిస్టుగా అభివృద్ధి చెందగలుగుతారు.

విప్లవ మేధావులు ఇంకొక కర్తవ్యాన్ని నిర్వహించాల్సి వున్నది. ప్రపంచంలో వివిధ దేశాల్లో సాగుతున్న విప్లవయుద్ధం గురించి, దాని అనుభవాల గురించి, మహత్తర చైనా విప్లవం— దాని పాఠాల గురించి మన 'రైతాంగంలో ప్రచారంచేసి వ్యాప్తి చేయాల్సివున్నది. ఈ పనులు చేయడంవల్లనే, విప్లవ మేధావులు పేదలు, భూమిలేని రైతులతో ఒకటై మంచి విప్లవకారులవుతారు.

# నేలతల్లి చెరను విడిపించగ

రెంజిమ్

విప్పపూల చెట్లసిగను – దాచిన విల్లంబులన్ని
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

లోహర్‌జ్వాల దారిలోన – దాచిన బల్లెమ్ములన్ని
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

బుగతగాడి నెత్తురుతో – తళ తళ లాడే కత్తులు
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

తులసికొండ లోయల్లో – దాచిన బంధూకులన్ని
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

గార్లరైలు దారిలోన – గుంజుకున్న బల్‌రైఫిల్
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

రూపాయీ కొండలోన – కోసిన సిపాయిపీక
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

ఆవిరికొండల కోనల – పారిన వీరుల రక్తం
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

చీకటికొండల కన్నుల – దాగిన వెన్నెలవెలుగులు
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

బుడారిసింగి కొండల్లో – పూచినపూలన్ని ఏరి
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

బొడ్డపాడు పోతుగడ్డ – గరుడభద్రి మెరపుదాడి
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

కైలాసం కళ్ళవెలుగు – వెంపటాపు చురుకుచూపు
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

పాణిగ్రాహి కత్తిపాట – మల్లిక్ పసిపాపనవ్వు
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!

పేదప్రజల ఆరాటం – శ్రీకాకుళ పోరాటం
నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!
విద్రోహుల మట్టుబెట్టి – రైఫిళ్ళను చేతబట్టి
ఎర్రసేన నిర్మించగ – ఎర్రప్రాంత మేర్పరచగ
అన్నలతో చేయికలిపి – నేలతల్లి చెరను విడిపించగ
రావాలోయ్ తమ్ముడా, జాగేలోయ్ తమ్ముడా!

[ శబరీనదీ ప్రాంతంలో కోయస్త్రీలు నృత్యంచేస్తూ, పాడిన పాకపాట ఈ పాటకు మూలం: 'నీకిస్తా తమ్ముడా! నీకిస్తా తమ్ముడా!' ఈ పాదాన్ని ఒకటికంటె ఎక్కువసార్లు పాడాలి].

## త్యాగమూర్తి తామాడ గణపతి!

సేకరణ: ప్రేమ పార్థానంద్.

[శ్రీకాకుళం తెలుగుదేశానికి ఉద్యానం (పోనీ ఒడ్డాణం). అందులోంచి వచ్చిందే ఉద్దానం లేదా ఉద్దానం. తామాడ గణపతి యీ ప్రాంతానికి చెందిన ప్రజాభిమానం చూరగొన్న నాయకుడు. ఆయన గురించి యిక్కడ కథలు చెప్పుకుంటారు. "గణపతీ శత్రువులకు నువ్వు దొరికినా, వాళ్లు నిన్ను కాల్చలేరు. ఇందిరాగాంధి నిన్ను కాల్చొద్దని, ప్రాణాలతో తన దగ్గరికి పట్టుకరమ్మని ఆర్డర్ యిచ్చిందట. ఆమెనిన్నొకసారి చూడాలని కుతూహలపడుతున్నదట"అని ప్రజలు గణపతితో చెప్పేవారు. విప్లవంలో చేరకముందు గణపతి ఆ ప్రాంతంలో ఉన్న అన్ని సంస్థలకు అధ్యక్షుడే. అది పంచాయితీ సమితిగాని, బడిగాని, సహకార సంఘం కాని. "మొదట, భూస్వాములను చంపితే ప్రజలు మాగురించి మంచిగా చెప్పుకోరు అనుకునేవాణ్ణి. మమ్ములను ప్రజల నుంచి యిది దూరం చేస్తుందని భయపడేవాణ్ని. చాలకాలం అధ్యక్షపదవి నా వర్గకసిని మొద్దుబారచేసి, నా మనసును బూర్జువా మానవతావాదంతో నింపిందని నాకిప్పుడు అర్థమయింది"అని గణపతి 1969 లో పోరాటప్రాంతంలోకి వెళ్ళిన ఒక పత్రికావిలేఖరితో చెప్పాడు. అప్పటినుంచి గణపతి యీ బలహీనతను అధిగమించగలిగాడు. వర్గశత్రువుల గుండెల్లో ఆయనపేరంటేనే ఒక హడల్ ఆనాటినుంచి.]

త్యాగమూర్తీ! తామాడ గణపతి!
ఆరిపోదూ! నీ విప్లవ జ్యోతి!
రైతుబిడ్డా! ఓ రాజ హంసా!
రాలినావా? బంగారు కొండా! ॥త్యా॥

'సోంపేట' తాలూకా! 'వుద్దానం' ప్రాంతానా!
'బొడ్డపాడు' గ్రామానా! తామాడోలింట్లోనా!
'కర్రెయ్య, దానమ్మ'ల కడుపున పుట్టేవా! ॥త్యా॥

మట్టిలో మాణిక్యం వున్నట్టుగా నీవు
'ఉద్దానం' మధ్య రైతు యింట్లో బుట్టావు!
చెడ్డ గుణాలకు శత్రువు అయినావూ! ॥త్యా॥

నీ మంచిగుణములు మెప్పు పొందినాయి!
గ్రామాని కందరికి ప్రేమ పుట్టించాయి!
అందరి ముద్దుబిడ్డవై పెరిగినావూ! ॥త్యా॥

పెరిగి పెరిగీ నీవు పెద్దవాడవయ్యావు!
పెద్దయ్యి పేదోళ్ళ తగువులెన్నో తీర్చావు!
లంచాలు ముట్టకుండ న్యాయం చెప్పావూ! ॥త్యా॥

పేద ప్రజలకు సేవలు చెయ్యాలని!
కమ్యూనిస్టుపార్టీ కాగడా బట్టావు!
రాజకీయాలలో రాటుదేలినావా! ॥త్యా॥

'వుద్దానం' ప్రజలను ఉద్ధరించాలనీ,
చదువు, సంధ్యలు చెప్పి వెలుగు తేవాలనీ,
సంఘాలు బెట్టావు సంగతి చెప్పావా! ॥త్యా॥

నీ పేరు పూరూరా నిప్పులా పాకిందీ!
మంచివాడవనీ సంతోషం పుట్టిందీ!
పిన్న పెద్దలు నిన్ను గౌరవించినారా! ॥త్యా॥

గ్రామ గ్రామాలకు పంచాయితీ వొస్తే!
మీ గ్రామ ప్రెశిడెంటుగ నిన్ను ఎన్నుకున్నారు!
గ్రామ బాధ్యతలు నీకు అప్పజెప్పినారూ! ॥త్యా॥

పంచాయిసమితి ప్రెశిడెంటు! తులసిదాసు
కపటా నాటకంతో కమ్యూనిస్టు అయితేను;
వాడి మాయనాటకాలు బయట పెట్టినావా; ॥త్యా॥

అధికారంతో వాడు అక్రమాలు చేస్తుంటే !
ఎరువులు, విత్తనాలు 'బ్లాకు' నమ్ముకుంటుంటే !
కమ్యూనిస్టులకివి తగవని చెప్పావా ! ॥త్యా॥

పార్టీకి ఉమ్మడిగా భూమి కొందమనగానే !
పదివేలు అప్పుతెచ్చి వాడి చేతికిచ్చావు !
డబ్బంత తిని నీపై 'దావా' వేశాడా ! ॥త్యా॥

కఠిన కసాయోడు కాంగి-రేసు అయ్యాడు !
కక్షతో నీ భూములు వేలమేయ వచ్చాడు !
నీ పక్క ప్రజలునిల్చి ఎదురు తిరిగినారా ! ॥త్యా॥

పందొమ్మిది వందల అరవై నాలుగులోనా !(1964)
అధిక 'శిస్తుల'తో ప్రజలు బాధ పడుతుంటే
అధిక 'శిస్తుల' రద్దుకు ఆందోళన చేశావా ! ॥త్యా॥

నీ నాయకత్వంతో నడుంకట్టి నిలిచారు !
'హర్తాళ్'కు వంద వేల మంది కదిలారు !
తాలూకాఫీసును చుట్టు ముట్టినారా ! ॥త్యా॥

అప్పుల బాధలకు, అధిక వడ్డీ, శిస్తులకు !
భూమీ పుట్టలన్నీ తాకట్టులు పెట్టేస్తే,
బతుకుదారీ లేదూ బద్ధర మన్నావా ! ॥త్యా॥

పంటల కొలతలకు షావుకార్లు వస్తారని,
దోపిడి, దొంగ కొలత, లెక్కలు చెపుతుంటారని,
పేపర్లు అచ్చు వేసి ప్రజలకు పంచావా ! ॥త్యా॥

జీడిమామిడి పంటా జోరుగా పండింది !
అరటి, కొబ్బరి సంపద అధికంగా వున్నాది !
అయినా కడుపునిండ తిండి మనకు లేకుందీ !
దీనికి కారణాలు దోపిడనన్నావా ! ॥త్యా॥

పెళ్ళిళ్లు చేయలేక పేదవాళ్ళు బాధపడితే
'కులపెద్దలు'2. "భోజీ"కావాలని పట్టుబడితె
'భోజీ బాజా'లతో పనిలేదన్నావా! ॥త్యా॥

మూఢాచారాలను మట్టిలోన కలపాలని
సాంఘిక మార్పులకు సాహిసించి నిలిచావు!
'పూలదండల పెళ్లిల్లె'న్నో చేశావా! ॥త్యా॥

పుద్దానం ప్రజలను విజ్ఞానుల చేయాలని
వూళ్లో ఉన్నత పాఠశాల కావాలని
చందాలు పోగుచేయ బయలుదేరినావా! ॥త్యా॥

'అండమాను'లోన సంఘం డబ్బున్నాదని
సంఘ సభ్యులంతా ఉత్తరాలు నీకు రాస్తే,
వీలు చూచుకొనీ ఓడ ఎక్కి వెళ్ళావా! ॥త్యా॥

అండమానులోన ఓడ నీవు దిగగానె
పూలదండలు వేసి స్వాగతాలు చెప్పారూ!
నీ మంచి పనులకంత గౌరవించినారా! ॥త్యా॥

అనువైన రోజు లండమానులోన ఉన్నావు!
అడవులు కొండలన్ని తిరిగి తిరిగి చూశావు!
బతుకు తెరువుకు పేదల బాధలు గన్నావా! ॥త్యా॥

ఉద్యానవనం లాంటి ఉద్దానం మనకుంటే,
తిండిలేకా ప్రజలు దండిగొలస పోతుంటే,
అసలైన కారణాలు వెదికి చెప్పినావా! ॥త్యా॥

ఉన్నత పాఠశాల ఊళ్లో పెట్టించావు!
పక్కగ్రామాలనుండి పిల్లల్ను చేర్చావు!
చదువులు నేర్పమనీ బోధలు చేశావా! ॥త్యా॥

దుర అలవాట్లకు దూరంగా ఉంచాలని
యువకుల నందరినీ ఉమ్మడిగా కూడేసి
రాత్రి చదువులు, ఆటలు, పాటలు నేర్పావా! ॥త్యా॥

కల్లు, సారా తగవులు ఊళ్లోన లేకుండా,
సంక్రాంతి ఉత్సవాలు, సంబరాలు చేశావు.
యువజన నాటకాలు, ఆటలు చూపావా ! ॥త్యా॥

'బొడ్డపాడు' పక్కన 'అల్లిమెండు'వున్నాది,
ఆ బంజరుకు పశువులు మేతకు వెళుతుంటేనూ,
ఈ ముండ సర్కారు తోటలు వేసిందా ! ॥త్యా॥

రెండువంద లెకరాల జీడితోట వేశారూ !
పశువుల మేతకు ఆంక్షలు పెట్టేశారూ !
ఆ ప్రాంత రైతులకు అల్లరి దెచ్చారూ ! ॥త్యా॥

తోట పక్కల ఆవులు, మేకలేవి కనబడినా !
బందెలదొడ్డిల బెట్టి జరిమాన వేస్తుంటే !
పండగ మామ్మూళ్ళని మేకలు కొని పోతుంటే !
'ఫారెస్టు' బాధలింక పడలేమన్నారూ ! ॥త్యా॥

పేదరైతుల బాధల, గాధలన్ని విన్నావు !
సమయం చూచి రైతు సంఘాలె పెట్టావు !
ఫారెస్టు అధికారులకెదురు తిరిగినావా ! ॥త్యా॥

నిండుమనసుతో నీవు దండిగ నీవు బలమిస్తే !
పశువుల కాపర్లూ, రైతు లేకమయ్యారు !
'ఫారెస్టు' అధికార్లను పట్టి తన్నినారా ! ॥త్యా॥

'ఫారెస్టు'అధికార్లకు ప్రజలు బుద్ధి చెపుతుంటే,
పగబూని పోలీసులు కేసు నీకు బెట్టారు !
నిన్ను పట్టి బంధించగ వూరికొచ్చినారా ! ॥త్యా॥

అరవై మంది వచ్చి ఊరుచుట్టు కాశారు !
మగవాళ్ళు, ఆడవాళ్ళ మాటలన్ని విన్నారు !
మట్టి కరచి మూర్ఖులు తిరిగి వెళ్ళినారా ! ॥త్యా॥

దోపిడి దొంగలంత పరిపాలన చేస్తుంటే,
పేదోళ్ళ పీకనొక్కి సంపద కాజేస్తుంటే,
ఈ ముండ పాడుబతుకు మన కొద్దన్నావా ! ॥త్యా॥

రోజు రోజుకు ధనికులు దౌర్జన్యాల్ చేస్తుంటే,
ప్రజలను కాల్చి చంపి పగలు తీర్చుకొంటుంటే, •
ఈ నిరంకుశమింక చెల్లదన్నావా ! ॥త్యా॥

ఓటులు కాజేసి సీటులెక్కి కూర్చున్నా,
"కాంగ్రెసు పాలకులు పేదప్రజల శత్రువులు"
ఈ శత్రు పాలకులను తరమాలన్నావా ! ॥త్యా॥

నిరుద్యోగమూ నిండుగా పెరిగుందీ,
కార్మిక సమ్మెలు కలసి పొంగుతున్నాయి !
అందర మొకటైతే ఎదురేదన్నావా ! ॥త్యా॥

'మావో' ఆలోచన సిద్ధాంతపు బాటలోన,
ప్రజాయుద్ధ మొకటే మన విముక్తి మార్గమన్నావు !
ప్రజలకు చాటిచెప్పి కూడగట్టినావా ! ॥త్యా॥

భూస్వాముల పాలన బుగ్గిపాలు చేయాలని,
వడ్డీ వ్యాపారుల నడ్డి విరుగ దన్నాలని,
సమాజ మార్పుకొరకు సాగి పోయినావా ! ॥త్యా॥

ఓటుల బూటకాలు మాటలింక మనకొద్దని
స్వేచ్ఛా జీవితాలు మనకు కూడ కావాలని,
పోరాటానికి నీవు పిలుపు నిచ్చినావా ! ॥త్యా॥

ఆకలి, బాధలకు ఎన్నాళ్ళిఁటా మంటూ,
ధనికుల సంపదలు ప్రజలకు పంచాలంటూ,
కదనానికి నీవు కదలిపోయినావా ! ॥త్యా॥

రహస్య జీవితంలో రాటుదేలి నిల్చావు !
ప్రియతమ 'పంచాది'(P.K.) బాటలోన నడచావు !
విప్లవానికి ప్రజలను ముందుకు నడిపావా ! ॥త్యా॥

దోపిడి, నిరంకుశులు, దుర్మార్గుల కొందరిని,
సాయుధ పోరులోన 'గోరీ'లే కట్టాలని
సాహస వీరుడవై నిలిచి పోరినావా ! ॥త్యా॥

'సోంపేట' తాలూకా, 'బాతుపురం' గ్రామానా ।
దోపిడి సావుకారు 'నిత్యానందం' యింట్లో
సంపదలన్ని ప్రజల పరం చేసినావా । ॥త్యా॥

కూలీ, రైతులను పీడించుకు తింటున్న,
'బొరివంక' గ్రామాన భూస్వాముల నిద్దరినీ,
ముక్క ముక్కలుచేసి మట్టి కలిపినావా । ॥త్యా॥

పేదరైతులను పీల్చి పిప్పిచేస్తున్నా
మదబలిసున్న "గరుడభద్ర" 'మద్దికామేశు'ని,
పట్టపగలే వెళ్ళి పాతి పెట్టినావా । ॥త్యా॥

నీ ధైర్య సాహసాలు ప్రజల నూపివేశాయి ।
యువకులు నీకు తోడు తోడుగా వచ్చారు ।
ప్రభుత్వ గుండెలదర పోరు సల్పినారా । ॥త్యా॥

'సోంపేట' తాలూకా భూస్వాములందరికీ
పక్కలో బల్లెమై పోరాటం నడిపావు ।
పేదల పెన్నిధివై నిలిచి పోయినావా । ॥త్యా॥

జిల్లా మహాసభకు ఏజన్సీ వెలుతుంటే,
'మతలబుపేట' వద్ద విశ్రాంతికి కూర్చుంటే,
పోలీసులకు శతృవు కబురు పెట్టినాడా । ॥త్యా॥

పోలీసు రాక్షసులచేత చిక్కిపోతేను,
నరరూప రాక్షసులు కట్టి నిన్ను కొడుతుంటే,
సింహగర్జన చేసి కట్లు తెంపినావా । ॥త్యా॥

శతృవు బాధలకు తల వంచని వీరుడవై,
చేతికున్న బేడీలతో ఎగిరి దెబ్బ కొట్టావు ।
పోలీసు అధికారుల నదరగొట్టినావా । ॥త్యా॥

నీ తోటి వీరుడైన డాక్టరు మన భాస్కరుడు ।
శతృవు మాటలకు వళ్ళుమండి లేచాడు ।
కాళ్ళతో శతృవులా గుండెను తన్నాడా । ॥త్యా॥

మన వీర గెరిల్లాలు కృష్ణమూర్తి, సన్యాసి,
మీ తోటి వీరులుగా నేలకొరిగి పోయారు!
విప్లవానికి గొప్ప వెలుగు తెచ్చినారా! ॥త్యా॥

ఇది పిరికి ప్రభుత్వమని నీవు నిరూపించావు!
విజయం ప్రజలదని నినాదాలు చేశావు!
'మావో'కు జై యంచు ప్రాణమీడినావా! ॥త్యా॥

నీ మరణవార్త విన్న నీ ప్రియతమ ప్రజలంతా!
గోడు గోడున తీరని శోకమనుభవించారు!
నిద్రా హారము మాని నీరై పోయారా! ॥త్యా॥

నీ వీర గెరిల్లాలు ప్రతిన బూని నిలిచారు!
నీ ఆశయాలకొరకు నిదురసట్టమన్నారు!
నీ బాటలోనే పోరు సాగిస్తున్నారా! ॥త్యా॥

పేదల కోసమే నీవు పుట్టి పెరిగావు!
పేదల కోసమే నీవు ప్రాణమిచ్చావు!
అమరజీవిగ నీవు వెలుగొందినావా! ॥త్యా॥

'ఉద్దానం' ప్రజల ముద్దుబిడ్డవైనావు!
చిరునవ్వు మోముతోడ అందరి మురిపించావు!
మా అందరి గుండెల్లో నీవు నిల్చి పోయావు! ॥త్యా॥

చరిత్ర పుటల్లోన ఎర్రగ వెలుగొందేవు!
త్యాగశీలివై ధరణిలోన మిగిలావు!
మా ఎర్ర వందనాలు అందుకోవయ్యా! ॥త్యా॥

[ఈ గేయం శ్రీకాకుళం జిల్లాలో తరుచుగా విన్పించే జానపద రూపం "మందావోడా! ఓరి మయవోడా! మామా! రార! ఓరి చిన్నవాడ" అన్న వరుసలో జనం పాడుకునేందుకు అనువుగా వ్రాయడమైంది.]

1. పజ్జి తులసీదాసు :— కొన్నాళ్లు కమ్యూనిస్టుగా నటించి, పంచాది, గణపతి, పాణిగ్రాహి మొ॥న విప్లవనాయకులతో స్నేహంగా వుంటూ, అతి నగ్నంగా

క్రూరంగా తన నిజస్వభావం, కాంగ్రెస్ టిక్కెట్టుచ్చుకొన్నాక బయట పెట్టిన ద్రోహి.

పంచాది, మరో ఆరుగురున్ను, గణపతి, డా॥ భాస్కరు, కంచరాపు కృష్ణమూర్తి మొ॥న మేటి విప్లవనాయకులు– పోలీసువాత పడడానికి కారకుడు ఈనాటి కాంగ్రెస్ ఎం.ఎల్ ఎ. వీడు.

2. భోజీ :– అన్న సంతర్పణ– కలవారైతే ఊరు మొత్తానికేగాక, చుట్టు పట్ల గ్రామాలకు కూడా చేస్తారు. మధ్యతరగతివారైతే గ్రామంలో ఇంటికి ఒక మనిషి చొప్పున, చుట్టాల బంధు, మిత్రులకు, పేదవారైతే తనకులాని కైనా సరే భోజన(విందు) ఏర్పాట్లు చేయాలనే నియమం. పేదలకు కాళ్ళూ, చేతులు ఆడని దుబారా ఖర్చు– భోజీ.

## లంబాడోడు గన్నెగాడు ....

వాని పేరు గన్నెగాడు లంబాడోడు గన్నెగాడు
వాడపల్లి దోచినాడు – ఓడపైన ఎక్కినాడు
కొండపోల్లో కోసినాడు – కొండలాగ ఎదిగినాడు ॥వాని॥
మిర్యాలం చూసినాడు – మీసామే దువ్వినాడు
గూడెంలో పేల్చినాడూ – గుంపెంతో చేసినాడు ॥వాని॥
రామ్మడుగూ రేపినాడూ – రాళ్ళగుట్టకెక్కినాడు
పిట్టల్‌గూడెం కొట్టినాడు – పిట్టల్లే ఎగిరినాడు ॥వాని॥
నల్లగొండ తిరిగినాడు – నలుగురితో మెలిగినాడు
పల్లెలెన్నో తిరిగినాడు – ప్రజలబాధ తెలిసినోడు ॥వాని॥
బుగతాలా చూసినాడు – బలుపంతా తీస్తాడాడు
దళాలెన్నో నడిపినాడు – దొరలనంత కోస్తాడాడు ॥వాని॥
బందూకూ పట్టినాడు – బరిగీసి నిల్చినాడు
పోకిళ్ళకు ఓర్చడాడు – పోలీసోళ్ళ మింగుతాడు ॥వాని॥

రైతుల్లో రాజువాడూ - రాజ్యామే తెస్తాడాడు ॥వాని॥
కమ్మినిస్టూ కత్తివాడూ - కలలన్ని పండిస్తాడు

మరుసటేడు వస్తాడాడు - మాతానికె వస్తాడాడు
మరువకుండ వస్తాడాడు - మా యిండ్లకె వస్తాడాడు ॥వాని॥
వానిపేరు గన్నెగాడు - లంబాడోడు గన్నెగాడు.

[ సామూహిక నృత్యాల్లో, కోలాటం పాటగా, పీర్ల పండుగనాడు పర్జిజలీపాట పాడుకోవచ్చు. ]

## ఓ నేస్తగాడా!

– చెరబండరాజు

ఓ నేస్తగాడా! నేనొస్తరా నేనొస్తరా
ఈరాస్తా విడవొద్దూ ఈపోరూ మానొద్దు
ఓ నేస్తగాడా! నేనొస్తరా నేనొస్తరా

ఆవుతోలు కప్పుకొనీ అంబా అంబా అంటూ
అడివంతా తిరుగుతుంది లేగలనూ తింటోంది
కనిపెట్టీ దారికాచి గురిపెట్టీ కొట్టాలిరా- దాని
గుండెగావు పట్టాలిరా
ఓ నేస్తగాడా! నేనొస్తరా నేనొస్తరా.

గడ్డిపరక నోటకరచి లేడిగంతులేసుకుంటు
అడుగులోన అడుగేసీ పిక్కలాగి తింటోంది
కునుకుమరిచి ఉండెలతో కళ్ళు చితకగొట్టాలిరా- దాని
పేగులాగి వెయ్యాలిరా
ఓ నేస్తగాడా! నేనొస్తరా నేనొస్తరా

ఒక్కసారి సామ్యవాద సజ్జనుడై ఖద్దరుడై
నమ్మించీ శ్రామికుణ్ణీ నమిలి నమిలి తింటోండు
తరిమికొట్టి పూరిమధ్య శిరసుపాతిపెట్టాలిరా- వాడి
జాతి పొతం పట్టాలిరా
ఓ నేస్తగాడా ! నేనొస్తరా నేనొస్తరా

ఓ నేస్తగాడా ! నేనొస్తరా నేనొస్తరా
ఈ రాస్తా విడువొద్దూ ఈపోరూ మానొద్దు
ఓ నేస్తగాడా ! నేనొస్తరా నేనొస్తరా

సమాజ మొకతీగ, శ్రమ దానిపాదు. కష్టజీవుల చెమటతోనే ఆకయినా, మొగ్గయినా, పూవైనా, కాయ ఐనా, పండైనా- చివరకు గాలి అయినా- నువ్వు కళగా, సౌందర్యంగా వర్ణిస్తున్న ఆ పువ్వులు, సంస్కృతిగా వర్ణిస్తున్న దాని పరిమళం, నాగరికతగా వర్ణిస్తున్న అందమైన తీగ కత్తిరింపు, ఉత్పత్తిలో నువు సాధించావనుకుంటున్న అభివృద్ధిగా చెప్పుకునే దాని ఫలాలు- అన్నీ ఆ చెమటలో తడిసి పుట్టి పెరిగినవే. అందుకే అన్నిటికీ హక్కుదారు కష్టజీవే.

పుస్తకపరిచయం "రక్తాశ్రువులు"

# భారత వైద్యశాస్త్ర వేత్తలారా మీ ప్రయాణం ఎటువైపు?

అదిస్పెయిన్. అతనొక కెనడియన్ డాక్టరు. అతనిప్రక్కన యువకుడైన యింగ్లీషు డ్రైవరు. గంటలతరబడి నడిపినా ట్రక్కు కొన్నిగజాలయినా ముందుకు నడవడంలేదు. ట్రక్కునడవడం కష్టమవుతున్నకొద్దీ కెనడియన్ డాక్టరుకు అసహనం, జాలీ, కోపం అధికమవుతున్నాయి. అయినా ట్రక్కు పూర్తిగా ఆగిపోయింది. ఇక అప్పుడు తిరుగు ప్రయాణంతప్ప మార్గంలేదు. ప్రాణాలకు తెగించయినా ముందుకు వెళ్ళాలనే వార్గి నిశ్చయాన్ని వమ్ముచేసిందేమిటి? అసలు ప్రాణాలకు తెగించయినా ప్రయాణం ముందుకే ఎందుకుచేయాలి?.

పెట్టుబడిదారీ సమాజపు ముద్దుబిడ్డ ఫాసిజం. ఫాసిజం స్పెయిన్‌ను బలిగొంటోంది దాన్ని ఎలాగయినా ఆపాలి. స్వేచ్ఛాప్రియులైన మానవులు తమ రక్తాన్ని చిందించి స్పెయిన్ ప్రజాస్వామ్యాన్ని కాపాడుతున్న క్షణాలవి. ఆ వీరులు తమ ప్రాణాలను తృణప్రాయంగా సమర్పిస్తున్న సమయంలో స్వేచ్ఛా, స్వాతంత్ర్య సమానత్వాలనాశించేవారు, వారి రక్షణకై తమ రక్తాన్నివ్వక తప్పదు. ఆలా యివ్వబడ్డ రక్తాన్ని తమ ట్రక్కునిండా నింపుకుని యుద్ధభూమికి వెడుతున్నారు కెనడియన్ డాక్టరూ, యింగ్లీషుడ్రైవరూ. స్పెయిన్‌లో అల్మీరియానుండి మాలగవరకు వొకేవొక రోడ్డుంది. వారి ట్రక్కు అల్మీరియా చేరేటప్పటికే మాలగ ఫాసిస్టుల చేతుల్లోకి పోయిందని తెలిసింది. అయినా మాలగ సరిహద్దు ప్రాంతాల్లోఉండే క్షతగాత్రుల రక్షణకై వారు ముందుకు వెళ్ళడానికే నిశ్చయించుకున్నారు. కాని వేలాదివీరుల ప్రాణాన్ని కాపాడాల్సిన రక్తపుసీసాల్నీ, యితర వైద్య పరికరాల్నీ క్రిందికిదించక తప్పని పరిస్థితి వారికెదురైంది. మాలగవైపునుండి తోసుకువస్తున్న మానవసముద్రం వారికా పరిస్థితి కల్పించింది. "నేల యీనినట్లు వాళ్ళు వస్తున్నారు. అగమ్యంనుంచీ అగమ్యానికి కదులాడే నీడల్లా వస్తున్నారు వాళ్ళు. సముద్రఘోషకు, కొండశిఖరాల ప్రతిధ్వనులకు వాళ్ళుచేసే సవ్వడి వొక్కటే రాళ్ళమీద వాళ్ళ జోళ్ళసవ్వడి. అతి కష్టంగా విడిచేవాళ్ళ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, ఎండి ఎర్రబడ్డ పెదాలు చీల్చుకుని వెలువడే సన్ననిమూల్గు", లక్షలాది ప్రజలను ఫాసిస్టుసైన్యాలు తుపాకులతో తరుముతున్నప్పుడు, ఫాసిస్టు విమానాలు ఆకాశంలో పైశాచిక నృత్యంచేస్తూ బాంబులవర్షం కురిపిస్తున్నప్పుడు ముందుకు

వెళ్ళడం తెలివితక్కువని ఆ డాక్టరుకు అర్థమయింది. అప్పుడిక అమూల్యమైన రక్తపు సీసాలను అవతలపారవేసి, సాధ్యమయినంత మందిని ట్రిక్కులో కుక్కుకుని తిరుగు ప్రయాణం చేయడమే ఉత్తమం. అయితే ఆ లక్షలాది ప్రజల్లో ఎవరెవరిని ట్రిక్కులోకి ఎక్కించాలి?.

ఆ సమయంలో "చిన్నపిల్లల్నిమాత్రమే" ట్రక్కులో ఎక్కించాలనే నిర్ణయాన్ని కెనడియన్ డాక్టరు తీసుకోవడానికి అతనికెవరధికారమిచ్చారు?.

అయినా అతను పిల్లల్నే ఎక్కించాడు. ఆడా, మగా, ముసలివాళ్ళని కసరి నెట్టేశాడు.

వారంతా మృత్యువు కౌగిట్లో బిగుసుకుపోతున్న ఆ సమయంలో "యింకా ఎందరికి చోటుంది?" అన్నాడు డ్రైవరుతో.

"యిద్దరికి" డ్రైవరు.

అసంఖ్యాకమైన ఆ ప్రజా సమూహంలో ఎవరో యిద్దరికి చావో బ్రతుకో తేల్చాల్సిన క్షణం.

ఒక తల్లినుండి బిడ్డను తీసుకోడానికి ప్రయత్నించాడు డాక్టరు. ఆమె బిడ్డని గాఢంగా తన హృదయానికి హత్తుకుంది. "నాబిడ్డని వొంటిగా తీసుకుపోయావో, మా యిద్దర్నీ నువ్వు చంపినట్లే" అంటున్నాయా తల్లిచూపులు.

అప్పుడా డాక్టరు తీర్పు —— యేమిటి?

ట్రక్కు కదిలింది. ఆల్మీరియావైపు పరుగెత్తింది. కెనడియన్ డాక్టరు అసంఖ్యాక ప్రజలతో కాలినడకన ముందుకు నడుస్తున్నాడు.

ఎవరీ కెనడియన్ డాక్టరు ??

అతనొక మానవుడు. అతనొక విద్యార్థి. అతనొక చిత్రకారుడు. అతనొక శాస్త్రజ్ఞుడు. అతనొక కవి. అతనొక సైనికుడు. అతనొక ప్రపంచ పౌరుడు. అతనొక మహోన్నత మానవుడు.

అతనే నార్మన్ బెతూన్. అతనే కామ్రేడ్ బెతూన్. అతనే కామ్రేడ్ పాచూ-ఎన్.

అందరూ అన్నిరకాల పుస్తకాలూ చదవడానికి వీలుకాదు. చదవాల్సిన అవసరమూలేదు. కొంతమంది కొన్నిరకాల పుస్తకాలు బాగాచదవగలరు. అందరూ కొన్ని, కొన్ని పుస్తకాలయినా తప్పక చదవాలి. అది మన జన్మహక్కు. అందరూ చదవాల్సిన కొన్ని పుస్తకాలుంటాయి. ఆ పుస్తకాలవల్ల మన ఆత్మలు అనంతమయిన ప్రకృ

తిలో మానవునియొక్క ఉన్నత శిఖరాలను చూడగలుగుతాయి. వాటిని చదవడంవల్ల మన హృదయాలు అతిచక్కగా స్పందిస్తాయి. సామాన్య మానవులమైన మనం ఎంతో కొంత పెరుగుతాము ఆ పెరుగుదల వాస్తవమైనది. ఆరోగ్యకరమైనది. అది భావ, భౌతిక ఫలితాలనివ్వగల పెరుగుదల. దాన్ని పునాదిగాచేసుకున్న మనం, ప్రకృతికీ మనకూగల వైరుధ్యాలనూ, మానవసమాజంలోని వైరుధ్యాలనూ, వ్యక్తిగతంగా మనలో గల వైరుధ్యాలనూ (భావ, భౌతిక సంఘర్షణలను) సరిగా Handle చేసుకోగలిగితే మనలో ప్రతివాడూ చైతన్యపూరిత మానవుడు కాగలడు.

అందరూ చదవాల్సిన పుస్తకంగా డాక్టర్ నార్మన్‌బెతూన్ అమరగాధను "రక్తాశ్రువులు"అనే పేరుతో తెలుగులో హైదరాబాదు జనతా ప్రచురణవారు ముద్రించారు.

అది 1890 మార్చినెల. ఆ నెలలోనే కెనడా దేశంలోని గ్రేవన్‌హర్ట్స్‌లో ఒక తుఫానురోజున నార్మన్‌బెతూన్ జన్మించాడు. తండ్రి- మాల్కొమ్ నికోలస్‌బెతూన్, తల్లి-ఎలిజబెత్. మతబోధకుడైన భర్తకుతగ్గ యిల్లాలామె. బెతూన్ చలాకి కుర్రవాడు. సరస్సుల్లో ఈతకొట్టడం అంటె ఎగిరిగంతేశేవాడు ఆ ప్రయత్నంలోనే ఒకసారి ప్రాణంమీదికి తెచ్చుకున్నాడు. సాహసకార్యాలుచేయడం అతనికి మహా ఆనందం. గొప్ప సర్జన్‌కావాలని తపనపడేవాడు. అతని తాతగారు గొప్ప సర్జన్. చిన్నప్పుడే చిన్నచిన్న జంతువులనూ, వాటి ఎముకలనూ పరీక్షిస్తుండేవాడు. తల్లిదండ్రులకు పిల్లలను ఒంటరిగా తిరగనీయకపోవడం ఒకవ్యాధి. అందుకేనేమో నార్మన్ ఒకసారి కావాలని తిరుగుబోతై, తప్పిపోయి పోలీసువాణ్ణి పట్టుకుని యిల్లుచేరాడు. అమెరికా తదితర దేశాల ప్రవేటు పెట్టుబడులకు, పరుగులుతీస్తున్న పారిశ్రామిక అభివృద్ధివల్ల కెనడా సారవంతమయినభూమి అయింది. అలాంటి కెనడాలో పెరిగాడు నార్మన్ బెతూన్, యూనివర్సిటీలో ప్రవేశించిన నార్మన్ ఆర్థిక యిబ్బందులవల్ల కొంతకాలం చదువు మానేశాడు. ఆ సమయంలో అతను అనేక ఉద్యోగాలుచేశాడు విలేఖరిగా, వెయిటర్‌గా, ఫైర్‌మన్‌గా, ఉపాధ్యాయుడుగా, కలపనరికేవాడుగా పనిచేశాడు. శరీర కష్టం అతనికి ఆత్మతృప్తినీ, దృఢమైన శరీరాన్నీ ప్రసాదించింది.

మరో సంవత్సరంలో వైద్యవిద్య పూర్తవబోతున్న సమయంలో ప్రథమ ప్రపంచ యుద్ధం వచ్చిపడింది. అతనూ యుద్ధోన్మాదంలో పడిపోయాడు. యుద్ధం ఎందుకో? ఎవరికోసమో? ఎవరి బొక్కసాలు నింపడానికో? యే జాతిని, యే వర్గ ప్రజలను దోపిడీ చేయడానికో తెలియని నార్మన్ సైన్యంలో చేరిన మొదటిజట్టులో ఒకడు. కెనడా ప్రథమ వైద్య చికిత్సాదళంలో స్ట్రెచర్ మోసేవాడుగా ఫ్రాన్స్‌వెళ్ళి యుద్ధం

యొక్క భయంకర రాక్షస దృశ్యాలను చూశాడు. గాయపడి ఆరు నెలలు ఆస్పత్రుల్లో వుండి, యుద్ధానికి పనికిరానివాడుగా తిరిగివచ్చాడు. చదువు పూర్తిచేసి బ్రిటిషు నౌకా దళంలో లెఫ్టినెంట్ సర్జన్‌గా 1918 వరకు పనిచేశాడు. యుద్ధం తరువాత, 28 యేళ్ళకే తెల్లబడిన వెంట్రుకలతో, భవిష్యత్తులోకి ప్రశ్నార్థకంగాచూస్తూ యింగ్లండులో మకాం పెట్టాడు.

లండన్ హాస్పిటల్‌లో పనిచేస్తున్న బెతూన్, 1923 లో F. R. C. S. పరీక్షల కోసం ఎడింబరో వెళ్ళాడు. అక్కడ పరిచయమైన ఫ్రాన్సిస్ అనే యువతిని వివాహ మాడాడు. ఆ తరువాత కెనడా సరిహద్దున వున్న డెట్రాయిట్‌లో ప్రైవేటు ప్రాక్టీసు ప్రారంభించాడు. ఆ సమయంలో ఫీజులు చెల్లించలేని, మందులు కొనుక్కోలేని అసంఖ్యాక రోగుల దీనావస్థను గమనించాడు. పెట్టుబడిదారీ బూటకపు ప్రజాస్వామ్యంలో వైద్యవృత్తి వ్యక్తిగత లాభంకోసం నడపబడే వ్యాపారం. వైద్యవృత్తిలోని ఆ నీచమైన అంశం బెతూన్‌ను అమితంగా బాధించింది. డెట్రాయిట్‌లోని వ్యభిచార గృహాలకూ, పేద ప్రజానీకపు మురికి కొంపలకూ వైద్య సహాయాన్నందించాడు. విపరీతమైన పనివొత్తిడివల్లా, యితర కారణాలవల్లా బెతూన్ ఆరోగ్యం క్షీణించింది. క్షయవ్యాధికి గురయ్యాడు, ఆ వ్యాధి ప్రమాదస్థాయికి చేరుకుంది. భార్యాభర్తలమధ్య ప్రేమాభిమానాలు చాలాకాలం నుండే క్షీణించనారంభించాయి. వారి వివాహం వొక విషాద పరిణామం. ప్రేమ ద్వేషాగ్నులమధ్య వారు జీవితాంతమూ ఊగిసలాడారు. అందుకే శానిటోరియంలో చేరుతూ ఫ్రాన్సిస్‌ను విడాకులు తీసుకోమని బ్రతిమిలాడాడు. క్షయరోగి చావునుగురించి పరిణామక్రమ కుడ్యచిత్రాలు గీస్తూ, మృత్యువుకోసం ఎదురుచూస్తున్న బెతూన్, విడాకుల వ్యవహారం పూర్తయిందని ఫ్రాన్సిస్ లేఖ వ్రాసినప్పుడు తప్పతాగి నిద్రపోయాడు.

క్షయవ్యాధితో రోజులు లెక్కబెట్టుకుంటూ "మధుర మృత్యుదేవత" గురించి గీతాలు వ్రాస్తూ; బెతూన్ డాక్టర్ జాన్ అలెగ్జాండర్ వ్రాసిన "శ్వాసకోశ క్షయరోగానికి శస్త్రచికిత్స" అనే గ్రంథం చదివాడు. అది బెతూన్ జీవిత చరిత్రనే మార్చివేసింది. బెతూన్ మృత్యువునే జయించాడు. అలెగ్జాండర్ చికిత్సా పద్ధతి అపాయకరమైందన్న వాదాన్ని తిరస్కరించి, శస్త్రచికిత్సకు ప్రయోగాత్మజీవి కావడానికి సిద్ధపడ్డాడు. విజయవంతంగా నిర్వహించబడిన శస్త్రచికిత్సతో పునర్జన్మపొందిన బెతూన్, క్షయవ్యాధిపై చావుదెబ్బలు తీయడమే తన జీవిత లక్ష్యంగా భావించాడు.

క్షయవ్యాధిపై నార్మన్ ప్రకటించిన యుద్ధం అతన్ని గొప్ప సర్జన్‌గానూ, వైద్యశాస్త్ర పరిశోధకుడుగానూ రూపొందించింది. కెనడా, అమెరికాల్లో అనేక హాస్ప

టల్స్‌లో పనిచేస్తూ, విద్యాబోధనచేస్తూ, అనేక శస్త్రచికిత్సా పరికరాలను రూపొందించాడు. ఈ కాలంలో అతను మరల ఫ్రాన్సిస్‌ను వివాహమాడాడు. కాని అది తిరిగి వైఫల్యానికి దారితీసింది.

వైద్యులు వేలాది రోగులను రక్షించగలిగినా, క్షయరోగులసంఖ్య లక్షలకు మించుతోంది. ఈ దారుణ పరిస్థితి బెతూన్ మనసును విపరీతంగా గాయపరచింది. అప్పుడత నిలా వ్రాశాడు. "యీవాళ అసంఖ్యాక రోగులవ్యాధి ప్రథమదశలో సుఖవుగా బాగయ్యేదశలోఉంది. వ్యాధి నిరోధకశక్తి లేకకాదు వాళ్ళు చావబోయేది. వెసులుబాటూ, ఆర్థిక స్థోమతాలేక చాలా సందర్భాల్లో చనిపోతున్నారు. పేదవాడు జీవించలేని స్థితిలో ఉన్నాడు. కాబట్టి చనిపోతాడు. ఇక్కడ ఆర్థిక, సాంఘిక శాస్త్రవేత్తలు ఉమ్మడి వేదికమీద వైద్య శాస్త్రజ్ఞుడితో కలుస్తారు."

యిక్కడే వొకప్రశ్న లేవనెత్తడం అవసరం. భారత వైద్య శాస్త్రవేత్తలకు కోట్లాది సోదర భారతీయులపట్లగల బాధ్యతను వారు యేవిధంగా నెరవేర్చదలచుకున్నారు?. మన దేశంలో భూస్వామ్య, పెట్టుబడిదారీవర్గాలూ, వారి యేజంట్లయిన పాలకవర్గాలూచేస్తున్న దోపిడీవల్ల అసంఖ్యాక ప్రజలు నానారకాల వ్యాధులతో అతి దారుణమైన జీవితాన్ని గడుపుతున్నారు. అంతేగాక వీరు దేశద్రోహకరంగా, విదేశీ ప్రభుత్వాల, విదేశీ మందులకంపెనీ యజమాన్ల దోపిడీకి బ్రోకర్లుగా పనిచేస్తున్నారు. మన ప్రజలనుభవిస్తున్న వ్యాధుల్లో 90% ఆర్థిక బాధలవల్లేననేది శాస్త్రీయసత్యం. దోపిడీ ఆర్థిక వ్యవస్థ సమూలంగా నిర్మూలింపబడనిదే ప్రజల ఆరోగ్యం రక్షించబడదు. ఈ ప్రాథమిక సత్యాన్ని గుర్తించడం వైద్యశాస్త్రవేత్తల బాధ్యతకాదా?. ఈ ప్రాథమిక సత్యాన్ని గుర్తించినప్పుడు వారెటువైపు ప్రయాణంచేయాలో అర్థంఅవుతుంది. ఈనాడు సంస్కరణవాద, మానవతావాద దృక్పథంతోమాత్రమే వైద్యవృత్తి కొనసాగించాలనే ప్రయత్నం దేశాభివృద్ధికి తోడ్పడదు. "వైద్యులారా, రోగులదగ్గరకు మీరే వెళ్ళండి" అన్న బెతూన్ సూక్తిని వరంగల్ హాస్పటల్ గోడలపై వ్రాస్తున్న వొక డాక్టరూ, మరొక వైద్య విద్యార్థి అరస్టుచేయబడ్డప్పుడు వొక పోలీసు ఆఫీసరు ఇచ్చిన సలహా వ్రాయడం అవసరం. "డాక్టర్లు... యిలా గోడలెక్కితేయెలా? ప్రజాసేవ చేయవద్దన్నామా!... చేయాలి. ఖమ్మం, ఏలూరు, విజయవాడలోచూడండి. కమ్యూనిస్టు డాక్టర్లు యెంతగొప్పగా ప్రజాసేవచేస్తున్నారో! మీరూ అలాచేయండి" చివరకి పోలీసు ఆఫీసర్లుకూడా ప్రజాసేవగురించి రాజకీయ తత్వశాస్త్ర ప్రథమపాఠాలు బోధించగలస్థాయికి చేరినందుకు సంస్కరణవాదులను అభినందించాల్సిందే.

అసంఖ్యాక ప్రజల వ్యాధులకు మూలకారణమైన దోపిడీవ్యవస్థను నిర్మూలించ ప్రయత్నించేవారితో చేతులు కలపడమే నేటి దేశభక్తులయిన వైద్య శాస్త్రవేత్తల కర్తవ్యం.

క్షయవ్యాధిపై తాను ప్రకటించిన యుద్ధం తనని ప్రఖ్యాత సర్జన్‌గా మాత్రమే మార్చిందిగానీ, క్షయవ్యాధి నిర్మూలింపబడలేదని గుర్తించిన బెతూన్ నేరుగా ప్రజల జీవిత వాస్తవికతల్లోకి ప్రవేశించాడు "గాయపడ్డ వాళ్ళకోసం జాలిపడను నేను— గాయపడ్డవాణ్ణి అవుతాను" అన్నట్లుగా. పెట్టుబడిదారీ వ్యవస్థ ఆర్థిక సంక్షోభంలోపడి ప్రజా జీవితం వర్ణించనలవికాని దారుణ దారిద్ర్యానికి లోనయినప్పుడు బెతూన్ ఆ నిర్భాగ్యులకు తాను చేయగలిగినదంతా చేశాడు. నిరుద్యోగులకు ఉచిత వైద్యసహాయం నుండి కెనడా వైద్య చరిత్రలోనే అపూర్వమైన ప్రజారక్షణ సంస్థ యేర్పాటు లాంటి కార్యక్రమాలు నిర్వహించాడు. ప్రజల్లో ఒకడుగా మారిన బెతూన్, పరిస్థితులను మరింత లోతుగా అర్థంచేసుకోడానికి రష్యా సందర్శించాడు, ఆదర్శప్రాయమైన, అద్భుతమైన రష్యన్ వైద్య సదుపాయాల గురించీ, చికిత్స గురించీ, కెనడా తిరిగి వచ్చిన తరువాత అనేక ఉపన్యాసాలు యిచ్చాడు. ప్రజల ఆరోగ్యరక్షణ విషయంలో పూర్తి అవగాహన సంపాదించిన బెతూన్ యిలా వ్రాశాడు: "వైద్యవృత్తిలో స్వంతలాభార్జనను తుదముట్టించేసి మన వృత్తికిని పచ్చి దోపిడీదారీ వ్యక్తిగతతత్వంనుంచీ పునీతం చేదాం. తోటి మానవుల దుఃఖాల్నీ, దౌర్భాగ్యాన్నీ కొల్లగొట్టి మనం మేడలు కట్టుకునే పద్ధతిని అపఖ్యాతి పాలుచేదాం." అనేక ఆలోచనలతో, ప్లానులతో తలమునకలుగా ఉన్న సమయంలోనే బెతూన్ కెనడా వైద్యబృందానికి నాయకుడుగా స్పెయిన్ బయలుదేరాడు.

"మోకరిల్లి బ్రతకడం కంటే కాళ్ళమీద నిలబడి మరణించడం మేలు" అన్న నినాదాల ప్రతిధ్వనుల్లో పోరాడుతున్న స్పెయిన్ ప్రజానీకానికి బెతూన్ రాక ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. వచ్చీరాగానే బెతూన్ క్షతగాత్రుల పరిశీలన ప్రారంభించాడు. యుద్ధం యొక్క స్థితిగతులను తెలుసుకున్నాడు. యుద్ధభూమికి వెనుకనున్న చికిత్సా శిబిరాలను సందర్శించాడు. లోపాలను తెలుసుకున్నాడు. యుద్ధోన్మాద ఫాసిస్టు సైన్యంతో, వీరోచితంగా పోరాడిన క్షతగాత్రులను రక్షించడానికి నూతన ప్లాను సిద్ధం చేశాడు. అత్యధిక క్షతగాత్రులను రక్షించాలంటే చికిత్సా కేంద్రాలను యుద్ధభూమికే తరలించాలని ప్రతిపాదించాడు. యుద్ధరంగంలోనే వేలాది క్షతగాత్రులకు రక్తం ఎక్కించి వారిని రక్షించే అద్భుతమైన కార్యక్రమాన్ని ఆచరణలో చేసి చూపించాడు. ఆ కార్యక్రమాన్ని నిర్వహించడానికి తూటాలజల్లుమధ్యకీ, బాంబుల వర్షంలోకీ వెళ్లాడు, ఫాసిస్టుల పైశాచిక యుద్ధ నేరాలవల్ల మాలగలో గాయపడ్డవారికి చికిత్స చేయడంతో

పాటు "హూలగ రహదారిలో నేరం" అన్న వృత్తాంతాన్ని వ్రాసి ప్రభుత్వానికి సమర్పించాడు యుద్ధంవల్ల అనాథలయిన బాలలకోసం బాలల గ్రామాల నేర్పరచడానికి సహాయపడ్డాడు.

మారిన యుద్ధగతివల్ల, స్పెయినుకవసరమయిన తక్షణ సహాయంకోసం ప్రచారంచేయడానికి కెనడావచ్చాడు. ఆ తరువాత కొద్దినెలలకు కెనడా కమ్యూనిస్టుపార్టీ సభ్యుడయ్యాడు. జపాన్ చైనాపై ప్రారంభించిన యుద్ధవార్తలు చదివిన బెతూన్ తన అవసరం చైనాలో అధికంగాఉందని భావించాడు. ఫ్రాన్సిస్ తదితర స్నేహితులదగ్గర శలవుతీసుకుని ఆసియాఖండానికి ప్రయాణమయ్యాడు బెతూన్.

అందరూ గుడిదగ్గరకు రావలసిందిగా విజ్ఞప్తి చేయబడింది. అక్కడొక మాంత్రికుడు తన మాయాజాలాన్ని ప్రదర్శిస్తాడట. పరకాయ ప్రవేశంలాంటి అద్భుతశక్తులను ప్రదర్శిస్తాడట. శవాలకు ప్రాణంపోస్తాడట. గుమిగూడిన ప్రజలంతా గుసగుసలతో, ఆతురతతో నిశ్శబ్దంగా నిలబడ్డారు. మాంత్రికునికి స్థానికభాషరాదు. దుబాసీ గట్టివాడే. మాంత్రికుడు చేతిని శుభ్రంచేసుకున్నాడు. చేతిలోకి వోసూది గుచ్చుకున్నాడు. సీసాలోదూర్చబడిన రబ్బరుగొట్టానికి ఆ సూది అమర్చిఉంది. గ్రామస్తులు విస్తుపడేలా ఆ సీసాలోకి యేదో ప్రవేశించింది. అదేమిటో? గ్రామస్తులు ఆశ్చర్యంలో ఉండగానే సీసా నిండిపోయింది. తనముందు మృత్యుఘడియల్లోఉన్న యువకుని చేతిలోకి ఆ సూదినిగుచ్చాడామాంత్రికుడు. సీసాఖాళీ. శవంగామారబోతున్నవాడు కాసేపటిలో చిరునవ్వునవ్వాడు. గ్రామ ప్రజల్లో ఆశ్చర్యం, ఆనందం, హర్షధ్వానం. ఈ అద్భుత కార్యక్రమం నర్సులను సిగ్గిలచేసింది. అందరిలో జిజ్ఞాసను రేకెత్తించింది. ప్రజావిముక్తికై ధైర్యసాహసాలతో పోరాడిన క్షతగాత్రుల ప్రాణరక్షణకై రక్తం యివ్వనిరాకరించిన నర్సులపై బెతూన్‌కు విపరీతంగా కోపంవచ్చింది. కాని తనకే సిగ్గేసింది తనకోపం తలుచుకుంటే. దేశవిముక్తికై ప్రాణాలను గడ్డిపోచలా తృణీకరించేవారు; దృఢమైన కారణం, అజ్ఞానజనితమైన విశ్వాసంవల్లమాత్రమే అలా వెనుకంజవేస్తున్నారని గుర్తించాడు నార్మన్. అందుకే ప్రజలందరికళ్ళముందూ రక్తమార్పిడికిని ప్రయోగాత్మకంగా చూపించి వారికి జ్ఞానోదయం కలిగించాడు. రక్తాన్ని శరీరం నుండి తీసినందువల్ల ప్రమాదమేమీలేదని ప్రజలు గ్రహించినప్పుడు క్షతగాత్రులకై, రక్తానికి కరువేలేదు. ప్రజల్ని అర్థంచేసుకోడం నమ్రతతో ప్రజలకునేర్పడం, ప్రజల నుండి నేర్చుకోడం అన్న మావో భావాల ప్రాముఖ్యాన్ని ఆచరణలో అతిసుందరమైన ప్రయోగాత్మక పద్ధతిలో చేసి చూపించాడు బెతూన్. ఈ అమరగాథలో పైకి సాధార

ణంగా కనబడే యీ సంఘటనకు చాలా విలువఉంది. ప్రఖ్యాత సర్జన్ నిర్వహించే అద్భుత శస్త్రచికిత్సలకంటే, అత్యున్నతమైన శ్రామికవర్గ దృక్పథంతో శాస్త్రీయ విజ్ఞానాన్ని సామాన్య ప్రజానీకంలోకి తీసుకువెళ్ళడం చాలా ప్రాముఖ్యతగల విషయం. అలాంటి విజ్ఞాన విస్తృతివల్ల మానవజాతి రూపురేఖలే మారిపోతాయి.

దారిలో అనేక అపాయాలకు గురవుతూ, 1938 లో నార్మన్ బెతూన్ చైనా చేరాడు. జపానువాళ్ళచే చంపబడ్డాడనే ప్రకటన కూడా వెలువడింది. యెలాగయితే నేమి, యానాన్ చేరుకున్నాడు. అక్కడ లభించిన ఉత్సాహపూరిత స్వాగతానికి ఉద్రేక పడిపోయాడు. మావోను కలుసుకున్నాడు. క్షతగాత్రుల చికిత్సకు సంబంధించిన లెక్కలుచెప్పి మావోను అదరగొట్టాడు. మావోను కలవడం బెతూన్ జీవితచరిత్రలో వొక సుదినం. మావో గురించి పాశ్చాత్య రచయితలు ఎంత అస్పష్టంగా చిత్రించారా అని ఆశ్చర్యపడ్డాడు. మావోతో తెల్లవారుజాము వరకు మాట్లాడిన బెతూన్ అతని "మృదుమధుర కంఠస్వరం, తరచి అడిగే ప్రశ్నాపరంపర"లకు ముగ్ధుడయిపోయాడు. అనివార్యమైన జపాను పరాజయంగురించి మావో బెతూన్‌కు బోధించాడు. బెతూన్‌ను అనేక ప్రశ్నలతో ముంచెత్తాడు. బెతూన్ మాటల్లో "మావో తనని కలుసుకునే ప్రతి వొక్కర్నీ ఎందుకు ముగ్ధుల్ని చేస్తాడో నాకిప్పుడర్థమయింది. ఆ వ్యక్తి వొక మహా శిఖరం. మన ప్రపంచంలోని మహా వ్యక్తుల్లో ఆయనొకడు."

యుద్ధభూమిలోనే చికిత్సాకేంద్రాలనే పథకంపట్ల ఉత్సాహం కనబరచిన మావో, రక్తాన్ని అతిశీతలంగా పారే వాగుల్లో భద్రపరచవచ్చనే బెతూన్ ప్రయోగంపట్ల ఆసక్తి ప్రదర్శించాడు. బెతూన్‌కు పూర్తిసహకారాన్ని యివ్వాలని సైనికాధికారులనాదేశించాడు. మావో-బెతూన్‌ల మైత్రి, లెనిన్-పావ్లావ్‌ల మైత్రిని గుర్తుచేస్తోంది. బెతూన్ మావోకు యుద్ధరంగంలో అందించిన సహకారం, పావ్లావ్ లెనిన్‌కు సిద్ధాంత రంగంలో యిచ్చిన చేయూతా ప్రపంచ మేధావులందరికీ ఆదర్శప్రాయమైంది.

యానాన్ నుండి ఆస్పత్రుల సందర్శనా పర్యటన ప్రారంభించాడు బెతూన్. వందలమైళ్ళు నడిచాడు. సామ్రాజ్యవాదుల, స్వదేశీ స్వార్థపరుల దోపిడీ ఫలితంగా ప్రజలనుభవిస్తున్న బాధలనూ, అధ్వాన్నపు స్థితిలోఉన్న వైద్యశాలల్లోని రోగులనూ చూచిన బెతూన్ హృదయం ద్రవించింది. ఆర్థికంగా తమ మెడికల్ యూనిట్‌ను స్వయంపోషకంగా మార్చేమార్గాల నన్వేషించాడు.

యుద్ధతంత్రరీత్యా చిన్-చా-చీ అనే ప్రాంతం కీలకస్థానంలో ఉంది. నరరూప రాక్షసులయిన ఫాసిస్టు సైనికులకూ, చైనా స్వాతంత్ర్యానికే కాక, ఆసియా జాగృతికై

పోరాడుతున్న సైనికులకూ అక్కడ భీకర పోరాటం జరుగుతోంది. 1938 జూన్‌లో అక్కడకు చేరిన బెతూన్ వెంటనే పని ప్రారంభించాడు. ఆదిమకాలంనాటి శస్త్రచికిత్సను గుర్తుచేసే పరిస్థితుల్లో రోజుకు 18 గంటలు పనిచేయసాగాడు బెతూన్. మత్తు మందులు లేవు. ఆపరేషన్ గదులులేవు. వడికిన నూలుదారంతో కుట్లు వేయడం. వీటికితోడు నేర్పరైన డా॥ బ్రౌన్ వెళ్ళిపోవడం. వైద్యశాస్త్ర సుశిక్షితులంటూ లేకపోవడం. అన్నీ అడ్డంకులే. అలాంటి పరిస్థితిలో చైతన్యపూరితుడైన టుంగ్-యా-చియాన్ దుబాసీగా పంపబడ్డాడు. అతనే బెతూన్‌కు 'బహిః ప్రాణం' అయ్యాడు. కొద్దిరోజుల్లోనే 8వ రూట్ ఆర్మీకి ప్రధాన వైద్యాధికారిగా, చిన్-చా-చీ ప్రాంత ప్రభుత్వానికి వైద్య సలహాదారుగా బెతూన్ నియమించబడ్డాడు.

పరిస్థితులెంత అధ్వాన్నంగా వున్నా నొక ఆదర్శ చికిత్సాలయానికి బెతూన్ పథకం సిద్ధంచేశాడు. దానికోసం 5 వారాల కార్యక్రమం తయారుచేసి. మావో అనుమతి పొంది, వొక గ్రామంలో సుందరమైన ఆస్పత్రి నిర్మాణం ప్రారంభించాడు. తనకు ప్రతినెలా 100 డాలర్లు యివ్వమన్న మావో ఆదేశాన్ని త్రోసివేసి, ఆస్పత్రికి వేలాది డాలర్ల ఖర్చుకై అనుమతి కోరాడు. ఆ సమయంలో "పనిచేస్తూ నేర్చుకోండి" అన్న సూత్రాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రాథమిక వైద్యశాస్త్ర అంశాలను, బొమ్మల్తోసహా వ్రాశాడు. దీన్ని ప్రభుత్వం ప్రచురించింది. గెరిల్లా యుద్ధ నిమిత్తం ప్రచురించబడిన మొదటి పుస్తకం ప్రపంచంలో యిదే.

చికిత్సాలయ సమావేశాల్లో సూటిగా, కటువైన విమర్శలుచేసేవాడు. బెతూన్‌కొక జబ్బుంది. బెతూన్‌కున్న ఆ కోపిష్టిజబ్బు అందరినీ భయపెట్టేది. సహచరులకు కాస్త యిబ్బందిగా ఉన్న ఆ జబ్బును గురించి ఆత్మవిమర్శ చేసుకున్న బెతూన్ దాన్ని నిర్మూలించుకుంటానన్నాడు. విశ్రాంతినెరుగక పనిచేస్తున్నాడన్న ఆరోపణలవల్ల జనరల్‌నై బెతూన్‌ను మందలిస్తూ, ఆర్మీకౌన్సిలు అతనికి 100 డాలర్లు యిమ్మన్న ఆదేశాన్ని నిర్లక్ష్యంచేయడానికిగల కారణమడిగాడు. అత్యున్నత సైనికాధికారి 5 డాలర్లు తీసుకొంటున్నప్పుడు, తనకు 100 డాలర్లెందుకివ్వాలన్నాడు బెతూన్.

అది ఆదర్శ చికిత్సాలయ ప్రారంభోత్సవదినం. చరిత్రాత్మకమైన ఆనాటి ప్రజా సమావేశంలో వక్తలు బెతూన్‌కు ధన్యవాదాలర్పించారు. అప్పుడు ప్రజలు తమకు బెతూన్‌పట్లగల ప్రేమ గౌరవాలకు చిహ్నాలుగా 7 అరుణపతాకలు బహూకరించారు. ఆ పతాకాలపై బంగారు దారాల్తో అక్షరాలను కుట్టారు. పాటలు పాడుతూ వరుసగా పతాకాల్ని సమర్పించారు. పతాకాలపై యిలా వ్రాశారు.

"డా॥ బెతూన్ మా గురువు
డా॥ బెతూన్ మా సహయోధుడు
డా॥ బెతూన్ మా వైద్యసలహాదారు
డా॥ బెతూన్ మా డాక్టరు
డా॥ బెతూన్ మా నేస్తం
డా॥ బెతూన్ మా ఆదర్శం
డా॥ బెతూన్ మా కామ్రేడ్"

తనపట్లగల ప్రేమను కళాత్మకంగా ప్రదర్శించిన ప్రజలనుద్దేశించి మాట్లాడుతూ బెతూన్ యిలా అన్నాడు: "మీవద్దనుండి నేను చాలా నేర్చుకున్నాను. నిస్వార్థంగా పాటుపడే చైతన్యం, కలసికట్టుగా సహకారభావంతో పనిచేయటం, ఎంత పెద్ద ఇబ్బందులనైనా అధిగమించడం, మీ వద్దనుంచీ నేను నేర్చుకున్న గుణపాఠాలు. అందుకు నేనెంతో కృతజ్ఞుణ్ణి"

యుద్ధం తీవ్రమైంది. వైద్య చికిత్స సైనికులకూ, ప్రజలకూ సరిగా అందించడానికొక సూక్తి చెప్పాడు బెతూన్. "డాక్టర్స్! గాయపడ్డ వాళ్ళదగ్గరకు మీరేవెళ్ళండి. గాయపడ్డవాళ్ళు మీదగ్గరకు వచ్చేవరకూ ఆగకండి." బెతూన్ సంచార చికిత్సాదళంతో యుద్ధరంగానికి బయలుదేరాడు. గ్రామస్థులు విప్లవగీతాలతో వీడ్కోలిచ్చారు. బెతూన్ దళం భయంకరమైన చలీ, యెత్తయిన పర్వతాలూ, విశాలమైన లోయలూ, నదులూ, మైదానాలూ, విపరీత గాడ్పులూ, తుపాకీ తూటాల జల్లులూ, బాంబుల వర్షాల లాంటి అడ్డంకుల నన్నింటినీ అధిగమించి వైద్య చికిత్స అవసరమయిన ప్రతి మారుమూలకీ వెళ్ళింది.

గ్రామంలో మకాంచేసిన కొద్దిరోజుల్లోనే పదులూ, వందల సంఖ్యలో శస్త్ర చికిత్సలను చేస్తూకూడా బెతూన్ ప్రతిగ్రామంలోనూ స్థానిక ప్రజలను కలసి, బిడ్డలను పరీక్షించి, వ్యాధిగ్రస్తులకు చికిత్సనందించాడు. మార్గమధ్యంలో అక్కడక్కడ జరిగే సమావేశాల్లో అంతర్జాతీయతా చైతన్యాన్నిగురించి మాట్లాడాడు. తీరికదొరగ్గానే నర్సుల శిక్షణా కళాశాల నిర్వహించాడు. ఆరోగ్యశాఖ డైరక్టర్ల అభినందన సందేశం అందుకున్న బెతూన్ పచ్చ పర్వతాలవైపు ప్రయాణమయ్యాడు.

నిద్రాహారాలులేకుండా మంచుపోతలో దీర్ఘప్రయాణంచేసి వొక క్యాజువాలిటీ సెంటరుకు చేరుకున్నాడు. అప్పటికే చాలా పొద్దుపోయింది. అయినా తిండి తినకుండానే బెతూన్ రోగులను చూడడానికి వెళ్ళాడు. కాని గాయంతో బాధపడుతున్న వ్యక్తికి

అధ్వాన్నంగా చికిత్సచేసి, అతని పరిస్థితిని క్షీణింపచేసినందుకు డా॥ ఫాంగ్‌ను చెడామడా తిట్టాడు. తన ఆరాధ్యదైవమైన బెతూన్ తిడుతుంటే ఫాంగ్ తలవంచుకున్నాడు. బెతూన్ అప్పటికప్పుడే ఆపరేషన్ పూర్తి చేశాడు. ఫాంగ్‌ను యే యూనివర్సిటీలో చదివావని అడిగాడు ఫాంగ్ నోరు విప్పలేదు. ఆ కేంద్రానికి సంబంధించిన రోగులు ఫ్రంట్‌కు దగ్గరగా ఉన్నారని తెలుసుకున్న బెతూన్ ఉదయం $4\frac{1}{2}$ గంటలకు బయలు దేరాలని చెప్పాడు కాని డైరెక్టర్ "కూ"కు అనుమానం వచ్చింది. బెతూన్ బహిః ప్రాణమైన టుంగ్‌నడిగాడు భయంగా $4\frac{1}{2}$ కు ఖచ్చితంగా బయలుదేరతాడా అని. "ఆయన గట్టిగానే చెప్పాడు- సూదంటురాయికి యినుపముక్క లెట్లాగో, గాయ పడ్డవాళ్ళు ఆయన కట్లాగే" అన్నాడు టుంగ్.

తెల్లవారుజామున ప్రయాణంలో ఫాంగ్ చరిత్ర తెలుసుకున్నాడు. ఫాంగ్ యే విశ్వవిద్యాలయంలోనూ చదవలేదు. పేద కుటుంబంలో పుట్టి. గేదెలను కాయడంలోనే కాలం గడిపిన ఫాంగ్ ఎర్ర సైన్యంలో చేరి చదువు ప్రారంభించి, నర్స్ అయ్యాడు. తరువాత హెడ్‌నర్స్; ఆ తరువాత శ్రద్ధతో శస్త్రచికిత్సలను గమనిస్తూ సర్జన్‌గా మారాడు. ఫాంగ్ కథ విన్న బెతూన్ విపరీతంగా బాధపడిపోయాడు. ఫాంగ్‌కు క్షమాపణ చెప్పుకున్నాడు. తనక్రింద పనిచెయ్యాలన్న ఫాంగ్ కోర్కెను తక్షణమే అంగీకరించాడు.

3 రోజుల్లో వరుసగా 40 తీవ్రమైన కేసుల ఆపరేషన్‌లు ముగించినవెంటనే యుద్ధం తీవ్రంగాఉన్న ప్రదేశానికివెళ్ళాడు బెతూన్. ఆపరేషన్‌లు జరుగుతున్నకొద్దీ క్షతగాత్రులసంఖ్య అధికమవుతూనేఉంది. అలాంటి సమయంలో క్షతగాత్రులను యింకా పంపడానికి వీలవుతుందా అన్న జనరల్ వాంగ్ ప్రశ్నకు బెతూన్ యిలా అన్నాడు. "గాయపడ్డవాళ్ళు వస్తున్నంత సేపూ, అపరేషన్లు జరుపుతూనే ఉంటాం" 24 గంటలు అవిచ్ఛిన్నంగా జరిగిన ఆపరేషన్‌లకు మత్తుమందిస్తున్న టుంగ్ 50 వ ఆపరేషన్‌కు చతికిలబడ్డాడు. టుంగ్ జ్వరంతో ఉన్నాడప్పుడు. క్షతగాత్రులువస్తూనే ఉన్నారు. కాని యుద్ధగతిమారింది. వీరోచితంగా పోరాడుతున్న గెరిల్లాల్లో వొకడు యిలా అరచాడు. "శత్రువుని చితగ్గొట్టండి కామ్రేడ్స్. గాయపడినవాళ్ళకి బాగుచేయ డానికి బెతూన్ యిక్కడున్నాడు" "ముట్టడించండి. బెతూన్ మనతోఉన్నాడు" అన్న నినాదం జపాను సైనికులకు సింహస్వప్నమయింది. బెతూన్ 40 గంటలపాటు నిర్వి రామంగా 71 ఆపరేషన్లు చేశాడు.

జపాన్‌తో చాంగ్ కైషేకుతా మిలాఖత్ అవడంవల్ల మందులూ, వైద్య పరికరాలూ దొరకడం అసాధ్యమైపోయింది. ఆ దారుణ పరిస్థితిలో మిస్ "హో"అనే మత బోధకురాలికి, మానవతావాదపు బోధనలుచేసి ఆమెను మందులకోసం పెకింగ్ పంపగలిగాడు బెతూన్. యుద్ధగతిమారింది. అందువల్ల బెతూన్ తనమకాం హొపేకిమార్చాడు. అధిక సంఖ్యాక క్షతగాత్రులవల్ల చివరికి క్లోరోఫామ్‌కూడాలేకుండా రాక్షస శస్త్ర చికిత్సలుచేశాడు. అక్కడ 69 గంటల్లో 115 మంది గాయపడ్డవాళ్ళకు చికిత్స జరిపాడు. ఫాసిస్టుల కనుగప్పి మిస్ "హో" మందులూ, ఆపరేషన్ పరికరాలూ తేగలిగింది.

రోగులసంఖ్య పెరుగుతోంది. సుశిక్షితులైన డాక్టర్లులేరు. మందులూ, పరికరాలూ పెకింగ్‌నుండి దొంగతనంగా తేవడం అసాధ్యమయిపోయింది. అమెరికానుండి బెతూన్ యూనిట్‌కు వస్తున్నడబ్బు మధ్యలోనే మిస్ అవుతోంది. మదాం సన్‌యట్ సేన్ గృహ నిర్బంధంతో మందుల పరిస్థితి యింకా అధ్వాన్నంగా తయారయింది. యిక అలాంటిస్థితి కొనసాగడం బెతూన్ సహించలేకపోయాడు. జనరల్ నైతో చర్చించాడు. యుద్ధంయొక్క దీర్ఘకాలిక స్వభావాన్ని గుర్తించినప్పుడు, వైద్య చికిత్సారంగంలో తన పంచవర్ష ప్రణాళికతప్ప గత్యంతరంలేదని నొక్కిచెప్పాడు. పెద్ద యెత్తున వైద్యసదుపాయాలను సృష్టించడమే ప్రధానసమస్య అని జనరల్'నై'కి స్పష్టం చేశాడు. అందుకొరకు 50 వేల డాలర్లు ఖర్చవుతుంది. స్పెయిన్‌కోసం బెతూన్ అంతకంటె ఎక్కువ సేకరించాడు. బెతూన్ రెండునెలలు కెనడా అమెరికాల్లో పర్యటించి డబ్బు, మందులు, పరికరాలతోపాటు అసిస్టంట్‌లను తీసుకురావాలనే నిర్ణయం జరిగింది. ఆ రోజుల్లోనే బెతూన్ "A manual of organisation and Tecnic for divisional field Hospitals in Gurrilla war"ను పూర్తిచేశాడు.

ఒకరోజు నార్మన్ ఆపరేషన్ టేబిలుదగ్గర గందరగోళపడ్డాడు. అతని అనుమానం నిజమైంది. అతను చెవిటివాడయ్యాడు. స్వదేశప్రయాణం యింకా కొద్దిరోజులుండనగా యీ విషాదకర నిశ్శబ్దత ఆవరించింది. ఆ నిశ్శబ్దత యెంత భయంకరమైంది? ఆ నిశ్శబ్దత తననెంత నిస్సహాయుడిని చేస్తుందో ఆలోచిస్తూ నిద్రించాడు. తెల్లవారుజామున వాచీ చూస్తే 4 గవుతోంది. ఎక్కడినుండో పిట్టకూత— భ్రాంతా— మరల రెక్కలుకొట్టుకున్న చప్పుడు. భ్రమా? కాదు. అతని ఎడమచెవి తిరిగి తన ధర్మాన్ని పాక్షికంగా నిలబెట్టుకుంది.

అమెరికా వెళ్లాల్సింది అక్టోబర్‌లోనే అయినా, పశ్చిమ హొపే ప్రాంతాల్లోకి 20 బేస్ ఆస్పత్రులను పర్యవేక్షించడం అవసరమని భావించాడు బెతూన్. స్వయంగా

ప్రయాణం నవంబరుకు వాయిదా వేసుకున్నాడు. పర్యవేక్షణ పూర్తి కావస్తున్న సమయంలో చిన్-చా-చీ ప్రాంతం 50 వేల జపాను సైన్యంతో ముట్టడించబడింది. చిన్-చా-చీ పడిపోతే తన అమెరికా ప్రయాణానికి అర్థంలేదని భావించిన బెతూన్ యుద్ధరంగంలోకి దూకేశాడు.

ఒక గ్రామంలో ఆస్పత్రి ప్రారంభమైంది. రెండవరోజు మధ్యాహ్నం శత్రువు ఆవైపే వస్తున్నాడని తెలిసింది. పారిపోయే వ్యవధికూడాలేదని హాస్పిటల్ సిబ్బంది కంగారుపడుతోంది. బెతూన్ రక్షణగురించి ఆందోళనకు గురవుతోంది. ఆందోళనా పూరితఅరుపులు. పారిపోవడానికి సన్నాహాలు. అంతా గందరగోళం. ఇంకా పది మంది క్షతగాత్రులున్నారు. శత్రువు 40 నిమిషాలతరువాతగాని అక్కడకుచేరలేడని తెలుసుకున్న బెతూన్, 30 నిమిషాల్లో అందరికీ చికిత్స చేయవచ్చని భావించాడు. క్షణాల్లో మరో రెండు ఆపరేషన్ టేబిల్స్ వేయించాడు. బెతూన్‌ను అక్కడి నుండి పంపేయాలనే ప్రయత్నం విఫలమైంది. ఆపరేషన్లు ఉరుకుల పరుగులతో జరిగిపోతున్నాయి. ఇంతలో హెడ్‌క్వార్టర్స్‌నుండి తప్పించుకోమని ఆదేశం. ఆమాటచెప్పే ఆపరేషన్ మధ్యలోవున్న బెతూన్ నిర్లక్ష్యం చేశాడు. చావుకూ, బతుక్కూ మధ్యగల దూరం సన్నిహితమవుతోంది. క్షతగాత్రుని కౌగలించుకోవాలనుకుంటున్న మృత్యువును బెతూన్ స్కాల్‌పెల్ చకచకా ఖండిస్తోంది. ఆ దేస్కాల్‌పెల్ రబ్బరు తొడుగు లేకుండా ఆపరేషను చేస్తున్న బెతూన్ వేలును గాయపరచింది. ఆ వేలును అయోడినులోముంచి మిగతా రోగుల చికిత్సకూడా పూర్తి చేశాడు. క్షతగాత్రుల్లో వొకడైన ఆఖరి కుర్రవాడు తన్ని వెళ్ళిపొమ్మని పదే పదే అర్థించినప్పుడు బెతూన్ యిలా అన్నాడు.

"ఒక్కక్షణంలో అయిపోతుంది. ఇప్పుడు కొద్దినిమిషాలపాటు చికిత్స చేస్తే తరువాత అది మానిపోయేట్లు నేను చూస్తాను. ఇట్లాగె వదిలేశానా, నీకు కాలు పోతుంది."

బెతూన్ బృందం క్షేమంగా టాంగ్‌నది పక్కనగల ఒక గ్రామం చేరుకున్నారు. పోరాటరంగంనుండి అక్కడికి మోసుకురాబడ్డ వారి కవసరమయిన శస్త్రచికిత్సలతో ఆ రాత్రింతా గడిచిపోయింది. వేలి గాయం తగ్గేవరకు చికిత్స మానమని టుంగ్ యిచ్చిన సలహాను కొట్టిపారేశాడు. కాని మరో రోజుకి వేలు వాచిపోయింది. దాంతో పాటు జ్వరం. ఆ వేలికి గంటుపెట్టి చీము తీసివేశాడు టుంగ్. వాపు ముంజేతికి పాకింది. పోరాటాలసంగతి బెతూన్‌కు చెప్పరాదని టుంగ్ శాసించినా, మర్నాడు

ఫిరంగిమోతలతో బెతూన్ లేచి బట్టలువేసుకుని, కోపంగా ఫాంగ్, టుంగ్‌లను చూస్తూ పోరాటస్థలానికి వెళ్ళడానికి అన్నీ సిద్ధం చేయమన్నాడు. బెతూన్‌ను ఆపాలనే టుంగ్ ప్రయత్నం ఫలితాన్నివ్వలేదు.

వర్షంలో బయలుదేరి, మంచు తుఫానులో క్యాంపుచేసి, ప్రయాణిస్తున్న బెతూన్ వైద్యకార్యాలయం చేరకముందే స్పృహతప్పి పడిపోయాడు. తెలివి వచ్చాక పడకపై పడుకుని క్షతగాత్రులను పంపవచ్చుని, కమాండర్లకు తెలియచేయమని కొంచం విశ్రాంతి తీసుకుని తాను ఆపరేషన్లు చేయడానికి సిద్ధమవుతానని చెప్పి కళ్లు మూసుకున్నాడు బెతూన్. ఆ రాత్రి కొంచం నెమ్మదించగానె థియేటరుకు పోతానని పోరుకాడాడు. ప్రశాంతంగా వుంటుందని బెతూన్‌ను పచ్చరాయి పల్లెకు మార్చారు. 'జనరల్' 'నె' ప్రత్యేకదూతద్వారా ఎన్ని కష్టనష్టాలకైనా వోర్చి బెతూన్‌ను సురక్షిత ప్రదేశానికి చేర్చాలనే సందేశాన్ని పంపాడు.

తన పరిస్థితి బెతూన్‌కు అర్థమయింది. ధనుర్వాతానికిగురై తాను మరణించబోతున్నానని గ్రహించాడు. దాన్నే ఫాంగ్, టుంగ్‌లకు విశదపరచాడు. కొంతసేపు వొంటరిగా వుండదలచిన బెతూన్‌ను అర్థంచేసుకున్నాడు టుంగ్. గ్రామ ప్రజలంతా గుంపులు గుంపులుగా కూడారు. బెతూన్ బహిఃప్రాణమైన టుంగ్ నిర్లజ్జగా, నిశ్శబ్దంగా ఏడ్చాడు. యువగెరిల్లా వీరులు బెతూన్‌ని సంస్మరిస్తూ ఆత్మార్పణకు ప్రతిన చేసిన వార్తను పాచూఎన్‌కు తెలియజేయమని టుంగ్‌కు చెప్పాడొక సైనికుడు.

49 యేళ్ళయినానిండని బెతూన్ జీవితంలో చావుకూ బతుకూ మధ్యగల సరిహద్దు రెండోసారి రద్దవుతోంది. బెతూన్ భారంగా లేచాడు. దీపం వెలిగించాడు. కాగితాలు తీసుకున్నాడు. అలసటగా మంచంపై పడుకున్నాడు. మరల లేచి కూర్చుని తన ఆఖరి అక్షరాలను వ్రాయసాగాడు. వ్రాతముగించి వెనక్కి వాలిపోయాడు. మరోరోజు గడిచింది. బెతూన్‌గురించి తక్షణవార్తలకై వచ్చే ఆదేశాలకూ, అభ్యర్థనలకు అంతంలేదు. యుద్ధమెలానడుస్తోందీ టుంగ్‌నడిగి తెలుసుకున్నాడు. రాత్రంతా చలితో వణకుతూ పడుకున్నాడు. మృత్యుగీతాలాపనలో అచేతనుడవుతున్న బెతూన్ జనరల్ 'నె'కి వ్రాసిన ఉత్తరాన్ని టుంగ్‌కు యిస్తూ కళ్ళుమూశాడు.

ఆ ఉదయం యింటి గుమ్మం ముందు టుంగ్ దీర్ఘాలోచనా నిమగ్నుడై నిలుచుని వున్నాడు.

గ్రామస్థులు టుంగ్‌ను చూసి ఆగి.........?

"ఆయన చనిపోయాడు"......

అది 1939 నవంబరు ఉదయం గం. 5—20 ని.

చైనా ప్రజానీకం తమ ప్రియతమ పా చూ ఎన్ అస్తమయానికి అంతులేని అశ్రుతర్పణవిడిచింది. జనరల్'నె' బాపురుమని విలపించాడు.

మాసియాంగు దేశప్రజలకుచేసిన ప్రసంగంలో ప్రజాసేవలో ప్రజలందరికీ బెతూన్ ఆదర్శప్రాయుడన్నాడు.

బెతూన్ ప్రథమవర్ధంతిసభలో చూ-టే యిలా అన్నాడు "బెతూన్ చైనాజాతీయ విమోచనోద్యమానికి తన జీవితాన్ని అంకితంచేశాడు. చైనాజాతి ఆయన్ని ప్రేమతో ఆరాధనాభావంతో సంస్మరిస్తూంది. ఒకనాడు యావత్ ప్రగతిశీల మానవజాతి ఆయన స్మృతిని పవిత్రంగా కాపాడుకుంటుంది."

డాక్టర్ బెతూన్ మరణానంతరం, అతను స్థాపించిన అంతర్జాతీయ శాంతి చికిత్సాలయాల్లో పొకదానికి భారతీయుడైన డాక్టర్ కొట్నీస్ డైరెక్టర్‌పదవి స్వీకరించాడు. భారత ప్రజల గౌరవాభిమానాలను చూరగొన్న కొట్నీస్ విధినిర్వహణలో మరణించాడు.

ఆదర్శ జీవులైన బెతూన్, కొట్నీస్‌లు భారత వైద్య శాస్త్రవేత్తలను "మీరెటు వైపు" అని ప్రశ్నిస్తున్నట్టుగా ఉంది. డాక్టర్ భాస్కరరావు, డాక్టర్ మల్లికార్జున్ భారత పీడిత ప్రజలవైపు నిలబడి మార్గదర్శకులయ్యారు.

సామ్రాజ్యవాద, వలసప్రభుత్వాలు కూడా చేయజాలని కిరాతక కృత్యాలను నేటి భారత పాలకవర్గం చేయగలదని, అది డాక్టర్ చాగంటి భాస్కర్‌రావు, డాక్టర్ మల్లికార్జున్‌లపై జరిపిన రాక్షస హత్యాకాండ చాటిచెప్తోంది. ప్రజలకోసం ప్రాణాలర్పించిన దేశభక్తియుత మేధావులయిన భాస్కర్, మల్లిక్‌ల త్యాగాలు, ఈ దోపిడీవ్యవస్థను భస్మీపటలం చేయడమనేది అనివార్యమైన చారిత్రక సత్యం.

భాస్కర్, మల్లిక్ లిద్దరూ వైద్యవృత్తిచేస్తూ బీద ప్రజానీకానికి ఉచిత వైద్య సహాయం చేయవచ్చుగదా ? అని ప్రశ్నించగలవారు పోలీసు అధికారులే కాదు యింకెంతో మంది ఉన్నారు. దశాబ్దాల, శతాబ్దాల తరబడి సంస్కరణవాదులూ, మానవతావాదులూ యీ దృక్పథాన్ని మోసుకొస్తూనే ఉన్నారు. దాంతోపాటు రకరకాల వ్యాధులూ వృద్ధిపొందాయి సోదర భారతీయుల ఆరోగ్యరక్షణ గురించి సీరియస్‌గా ఆలోచించే యే వైద్యశాస్త్రవేత్తయినా, ఈ సామాజిక వ్యవస్థలో సామాన్య మానవుల ఆరోగ్య రక్షణ సాధ్యమని చెప్పగలడా ?

ప్రజల ఆర్థిక, సామాజిక పరిస్థితులతో సంబంధంలేని వ్యాధుల శాతం ఎంత ? స్వల్పం. అలాంటప్పుడు ఉచిత వైద్యసలహాలవల్ల పొరిగేది యేమిటి ? ఉచిత వైద్యం నేరమనీ, మోసమనీ కాదు. వ్యాధుల మూలకారణాల గురించి నోరు మెదపకుండా, ప్రాథమిక కారణాన్ని నిర్మూలించాల్సిన అవసరాన్ని ప్రజలకు బోధపరచకుండా చేసే ఉచితవైద్యం పెద్ద కుట్ర.

దోపిడీరహిత సమాజంలోనే ప్రజలకు ఆరోగ్యరక్షణ ఉంటుంది. అందువల్ల వైద్య శాస్త్రవేత్తలు ఆత్మవిమర్శ చేసుకోవాలి. సరైనమార్గాన్ని ఎంచుకోవాలి. భారత విప్లవంలో తామెవరిపక్షమో తేల్చుకోవాలి.

నార్మన్ బెతూన్ అమరగాథను ముద్రించిన జనతా ప్రచురణవారినభినందించాలి హృదయాల్ని కదిలించే బెతూన్ అమరగాథను మనకందించిన సహవాసిగారు సంక్షిప్తానువాదంకాక – పూర్తిగాచేస్తే బాగుండేదేమో.

పుస్తకం ఖరీదు తక్కువే. 3–20 రూ॥లు

యిది అందరూ చదవాల్సిన పుస్తకమయినా, వైద్య విద్యార్థులూ. డాక్టర్లూ తప్పకుండా చదవాల్సిన పుస్తకం.

సిడ్నీగోర్డన్, టెడ్అలన్‌లు యింగ్లీషులోరాసిన "The scalpel, The sword" కు యిది సంక్షిప్తానువాదం.

జనతా ప్రచురణవాదం యికముందు యింకా గొప్ప పుస్తకాలను అందిస్తారనే ఆశిద్దాం.

ఆర్. భుజంగరావు.

## విశాఖ సెంట్రల్ జైలులో చైనా విప్లవ వార్షికోత్సవం

అక్టోబర్ 1వ తేదీన విశాఖ సెంట్రల్ జైలులో విప్లవకారులు చైనా విప్లవ వార్షికోత్సవాన్ని జైలు అధికారుల నిర్బంధాలమధ్య జయప్రదంగా జరుపుకోగల్గారు. కామ్రేడ్‌బాబా ఎర్రజండాను ఆవిష్కరించారు. జెండాను స్వాధీనం చేసుకొనేందుకు పెద్దసంఖ్యలో మోహరించబడిన జైలువార్డర్లుచేసిన ప్రయత్నాలను విప్లవకారులు ఓడించగలిగారు, విప్లవ నినాదాలతో ఊరేగింపుజరిపి సమావేశం జరుపుకొన్నారు. సమావేశానికి కామ్రేడ్ గోరు మాధవరావ్ అధ్యక్షత వహించారు. కామ్రేడ్ ఎస్ ఎ. రవూఫ్ చైనా కమ్యూనిస్టుపార్టీ 10వ మహాసభకు కామ్రేడ్ చౌ-ఎన్-లై సమర్పించిన నివేదికను చదివి వినిపించారు. కొన్ని భాగాలను వివరించారు. తరువాత కామ్రేడ్ ఇంతా రమణారెడ్డి మాట్లాడుతూ ఏ జాతీయ అంతర్జాతీయ పరిస్థితుల్లో చైనా విప్లవ వార్షికోత్సవాన్ని జరుపుకుంటున్నామో వివరించారు. మన ప్రియతమ నాయకుడు అమరుడు కా॥ చారుమజుందార్ విప్లవ పంథాను రక్షించుకోవాల్సిన అవసరాన్ని నొక్కిచెబుతూ, పార్టీలోపలా బయటానున్న విప్లవ ప్రతీఘాతుక శక్తులనుండి పార్టీని కాపాడుకోవాలని చెప్పారు. ప్రపంచ కమ్యూనిస్టు పుద్యమానికి ప్రధాన ప్రమాదం రివిజనిజం అని చెప్పారు. కా॥ చారు మజుందార్‌చే రూపొందించబడిన వర్గ శత్రుసంహారక యుద్ధంమీద అన్నిరకాల అభివృద్ధినిరోధకులు చేసేదాడిని ఎదుర్కొంటూ వర్గ శత్రు సంహారక యుద్ధాన్ని కొనసాగించాల్సిన అవసరాన్నిగురించి నొక్కిచెప్పారు.

పత్రికా ప్రకటన :

# ఇది విప్లవాల యుగం

**విప్లవ సాహిత్య సృజన శ్రామిక పక్ష రచయితల — జన్మహక్కు.**
**నిర్బంధ విధానం ప్రజా పోరాటాన్ని ఆపదు.**

విప్లవ రచయితల సంఘం విజయవాడలో 16 అక్టోబరున జరిపిన కార్యవర్గ సమావేశంలో ఈ క్రింది తీర్మానాలు చేసింది.

1) పెద్ద ప్రజాస్వామ్యపు బుద్ధిమంతులమని చెప్పుకుంటున్న భారత పాలక వర్గం వారు విప్లవ రచయితల సంఘం ఏర్పడిన నాటినుండి, తమ హిట్లర్ స్వభావాన్ని అంచలవారిగా ప్రయోగిస్తూనే వున్నారు. నిఘాలు, ఉత్తరాల సెన్సార్, పుస్తకాల నిషేధం మున్నగు చర్యలద్వారా విప్లవ రచయితల సంఘాన్ని వెన్నంటి తరిమే ఇందిరా సోషలిస్టు ప్రభుత్వం తిరిగి మరోసారి విరసం సభ్యులైన వరవరరావు, యం.టి. ఖాన్, చెరబండరాజులను ఆంతరంగిక భద్రతా చట్టం కింద నిర్బంధించి తన ప్రజా స్వామిక నగ్నస్వరూపాన్ని బయటపెట్టుకుంది

ఇది విప్లవాల యుగం. నిర్బంధ విధానాలు ప్రజా పోరాటాలని ఆపలేవు. తెలుగు సాహిత్య చరిత్రలోనే మొట్టమొదటిసారిగా కష్టజీవుల కంకితమైన సాహిత్యోద్యమ వి.ర.సాన్ని నిర్బంధవిధానంద్వారా ఆపివేయగలమనిభావించడం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు దివాలాకోరుతనాన్ని చాటగలదు.

నేటి సాంఘిక వ్యవస్థను మార్చడంలో శ్రమజీవుల పక్షాన నిలబడి భావ విప్లవ కార్యక్షేత్రంలో యోధులుగా పోరాడే విప్లవ రచయితలు- సాంస్కృతిక రంగంలో అగ్రగాములుగా నిలబడతారు. విప్లవ రచయితలు ఆంతరంగిక భద్రతకు భంగంకాదు. కాని వాళ్లు బూర్జువా సంస్కృతినికూల్చివేయడంలో డైనమెట్లలాంటి వాళ్లు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు ప్రస్తుత దుర్మార్గ విధానాన్ని సామూహికంగా ఖండించడానికి తొలిచర్యగా మహాకవి శ్రీ శ్రీ నాయకత్వాన విప్లవ రచయితల సంఘం అక్టోబరు 26 ఉదయం 11 గంటలకు ఆంధ్రప్రదేశ్ సచివాలయం (హైదరాబాద్)ఎదుట ఒక నిరసన ప్రదర్శనను నిర్వహించనున్నది.

ఈ నిరసన ప్రదర్శనలో పాల్గొనవలసిందిగా తోటి రచయితలను, కవులను, మేధావులను ముఖ్యంగా విద్యార్థులను విరసం కోరుతూవుంది. ఈ ప్రదర్శనను

దిగ్విజయం చేయవలసిందని ప్రజల పక్షం వహించే మేధావులందరికి వి ర సం విజ్ఞప్తి చేస్తున్నది.

2) నిర్బంధితులైన రచయితల విడుదలకోసం జరుగుతున్న యీ ఉద్యమానికి విరి విగా విరాళాలు ఇచ్చి తోడ్పడవలసిందని ప్రజలందరిని విరసం కోరుతూవుంది. తమ విరాళాలను నిఖిలేశ్వర్, 46, విద్యానగర్ కాలనీ, హైదరాబాద్-500044 కు పంపవలసిందని మనవి.

త్రిపురనేని మధుసూదనరావు
కార్యదర్శి
విప్లవ రచయితల సంఘం,
ఆంధ్రప్రదేశ్.

## వి. ర. సం. సభ్యుల అరెస్టులను ఖండిస్తూ ఖమ్మం జిల్లాలో నిరసన ప్రదర్శనలు

వి. ర. సం. సభ్యులు వరవరరావు, చెరబండరాజు, ఎం. టి. ఖాన్‌లను ప్రభుత్వం అరెస్టు చేసినందుకు నిరసనగా ఖమ్మంలో విద్యార్థులు ప్రభుత్వ ఫాసిస్టు విధానాన్ని ఖండిస్తూ 18-10-73 న అన్ని కళాశాలల్ను, హైస్కూల్సును బహిష్కరించారు. సమ్మె నూటికి నూరుపాళ్ళు విజయవంతమయింది.

దిక్కులు పిక్కటిల్లేటట్టుగా ప్రభుత్వ ఫాసిస్టు విధానాన్ని ఖండిస్తూ నినాదాలతో పట్టణంలోని ప్రధాన వీధులగుండా విద్యార్థులు ఊరేగింపు జరిపారు. ఖమ్మం తాలూకా లోనూ, మధిర తాలూకాలోనూ అన్ని కళాశాలల, జూనియర్ కళాశాలల, ఉన్నత పాఠశాలల విద్యార్థులు తరగతులను బహిష్కరించి ప్రజా రచయితలను అరెస్టు చేసినందుకు ప్రభుత్వ దమననీతిని ఖండిస్తూ తీవ్ర నిరసన తెలియజేశారు.

సాయంత్రం ఆరు గంటలకు ఖమ్మం మునిసిపల్ హాలులో బహిరంగ సభ జరిగింది. దీనికి పట్టణంలోని ప్రజలు, పల్లెల నుండి రైతులు, విద్యార్థులు అధిక సంఖ్యలో హాజరైనారు. వక్తలు ప్రభుత్వ నిరంకుశత్వాన్ని నిరసిస్తూ విప్లవ రచయితలను వెంటనే విడుదల చేయాలని డిమాండ్ చేశారు.

ఈ సభలో చేయబడ్డ తీర్మానాలు :

1) విప్లవ కవులు— వరవరరావు, చెరబండరాజు, ఎం. టి. ఖాన్‌లను వెంటనే విడుదల చేయాలి.

2) విప్లవ సాహిత్యంపై, విప్లవ కవులపై ప్రభుత్వం సాగిస్తున్న అక్రమ దాడులను ఖండిస్తూ అలాంటి ఫాసిస్టు చర్యలు మానుకోమని హెచ్చరిస్తున్నాం.

## అరెస్టుల తర్వాత

ఎక్కడ అణచివేత వుంటుందో అక్కడ ప్రతిఘటన వుంటుంది. ఎక్కడ నిర్బంధం వుంటుందో అక్కడ పోరాటం వుంటుంది. ఎక్కడ నిరంకుశత్వం తన పైశాచికహస్తాన్ని చాస్తుందో అక్కడ ప్రజల కోపాగ్ని ప్రజ్వరిల్లుతుంది. ఇవి చరిత్రలో తెలుసుకోవద్దన్నా తెలిసే పాఠాలు.

ప్రజలు విప్లవాన్ని కోరుతారు అని మావో చెప్పింది నిత్యం ప్రపంచంలో కన్పిస్తున్న సామాన్య సత్యమే. ప్రజలు విప్లవాన్ని కోరుతారు. విప్లవ రచయితలు చెప్పినని కోరరు. విప్లవ రచయితలు చెప్పకపోతేనూ ఆగదు. ప్రజలు విప్లవాన్నికోరటం ప్రజలకున్న ప్రపంచానికివున్న పరిస్థితిలోనే వుంది.

వరవర్, ఖాన్, చెరబండరాజులను అరెస్టుచేస్తే విప్లవ రచయితల సంఘాన్నీ, ప్రజలను భయపెట్టొచ్చని ప్రభుత్వం ఆశఅయితే అది అప్పుడే నిష్ఫలం ఐపోయింది.

తెలుగు దేశం అంతటా ఎన్ని కరపత్రాలు ఎన్నెన్ని సంఘాలపేరులతో వెలువడినవ్ ! ఒకోకరపత్రం చదివినవారికి ఎంత ఉత్తేజాన్ని, పరిశీలననూ కల్గించినవ్ !

ఎన్నిచోట్ల మీటింగులు ? ఎందరి నిరసన ప్రకటనలు !

విప్లవ రచయితలయెడ, విప్లవంయెడ ప్రజలకున్న అనుబంధం అరెస్టులతో అంతమవదనీ, యింకింత యినుమడిస్తుందనీ యీ 15 రోజులకీ రుజువైపోయింది.

16 వ తేదీ— వరంగల్‌లో అన్ని స్కూళ్లు, కాలేజీల్ను విద్యార్థులందరూ బాయ్‌కాట్ చేశారు. 'విద్యాలయాలను బహిష్కరించండి' అన్న కరపత్రంతో వలంటీర్లుగా గుంపులు గుంపులుగా విద్యార్థులు ప్రచారం చేశారు.

అదేరోజున హనుమకొండలో విరసం అధ్వర్యంలో బహిరంగసభ. అదే చోటున విరసం నాయకులందరూవచ్చి ఎన్నో సాంస్కృతిక ప్రదర్శనలున్న 6 వ తేదీ నాడు వచ్చిన ప్రజలకంటే రెట్టింపుప్రజలు సభకు వచ్చారు. నాయకులెవరూ లేకపోయినా యువ విద్యార్థులే యిచ్చిన ఉద్రేకపూరిత ఉపన్యాసాలకు ప్రజలు ప్రతిధ్వనించారు.

18 వ తేదీన ఖమ్మం స్కూళ్ళనూ కాలేజీలనూ విద్యార్థులు బాయ్‌కాట్ చేశారు. ఊరేగింపు చేశారు. బహిరంగసభ జరిపారు. ఏ నాయకులో వచ్చి చేసినవి కావివి. యువకుల్లో విద్యార్థుల్లో విప్లవాభిమానుల్లో వచ్చిన ఐచ్ఛిక స్పందనయిది.

24 వ తేదీన హనుమకొండ టౌన్‌హాల్లో పట్టణ మేధావుల సదస్సు. టీచర్లు, లెక్చరర్లు, లాయర్లు, డాక్టర్లు, జర్నలిస్టులు సమావేశమయారు. 250 మంది మేధా

వులు ఒకచోట కూడటం, ప్రశాంతంగా, సీరియస్‌గా మాట్లాడుకోవటం, రాజకీయాలు వాదవివాదాలుకాక పౌరులుగా భారతదేశంలో ప్రజలనుభవిస్తున్న హక్కుల తమాషాని చర్చించారు. పౌరులుగా మేధావులు ముందుకురావాలని పిలుస్తూ, రచయితల విడుదలను డిమాండ్‌చేస్తూ ఏకగ్రీవంగా తీర్మానించారు.

హైద్రాబాద్‌లో రచయితల ప్రదర్శన. తెలుగుభాషకు గర్వకారణమైన మహాకవి శ్రీ శ్రీ మద్రాసునుండి వచ్చి ప్రదర్శనకు నాయకత్వం వహించారు. పారిస్‌లో ఒక విప్లవ పత్రికను నిషేధించినందుకు సార్త్ర్ ప్రదర్శనచేశాడని అపూర్వంగా చెప్పుకొన్నాం. మన తెలుగుదేశంలో యీనాడు శ్రీ శ్రీ నినాదాలతో గేయాలాపనతో సెక్రటేరియట్ ముందు ప్రదర్శన చేశారు. శ్రామిక, విప్లవ మహాకవిగా ప్రజలముందుకొచ్చారు. రా వి శాస్త్రి, కె.వి. రమణారెడ్డి మొ॥ ఎందరో రచయితలు ఫాసిస్టు భద్రతా చట్టం నశించాలని, సాయుధపోరాటమే ఏకైకమార్గమని నినాదాలతో ప్రదర్శన చేశారు.

అదేరోజు సాయంత్రం సారస్వతపరిషత్ గ్రౌండ్‌లో బహిరంగసభ. 15, 16 మంది రచయితలు మేధావులు ఉపన్యసించారు. ఎస్. బి. గిరి, యం.పి.కి తన పాత విప్లవకర దినాలు జ్ఞప్తికొచ్చినట్టు. సాయుధపోరాటం వినా మార్గంలేనట్లు తనకూ అనిపిస్తోందన్నాడు.

ప్రజలచేతుల్లో ఆయుధాలు లేకుంటేనే ప్రభుత్వం యింత భయపడుతోంది. ఇక ఆయుధాలు పుచ్చుకొంటే చెప్పేపనిఏముంది అన్న రా వి శాస్త్రిగారు సత్యాన్ని చక్కగా చెప్పారు. అరెస్టయినవారి కొరకు నిధి కోసం విజ్ఞప్తిచేసి శ్రీ శ్రీ తిరిగి అడుగగా అక్కడికక్కడే సుమారు రూ. 500/– వసూలయినవి.

ముందే విశాఖపట్నంలో బహిరంగసభ జరిగింది. అటు అనకాపల్లిలో ఆమూల అనంతపురంలో సభలు సమావేశాల నిర్ణయాలు.

హైద్రాబాద్‌లో మేధావులు, ప్రొఫెసర్లు వగైరాలు 111 మంది అరెస్టులను ఖండిస్తూ ప్రకటించారు. వృద్ధ తెలుగు ఆచార్యులు పాటిబండ మాధవశర్మగారితో సహా పెక్కుమంది విశ్వవిద్యాలయ డిపార్ట్‌మెంటులో ముఖ్యులు.

వేసుకొనే పత్రికలు లేకగాని ఎందరు ఎన్ని వృత్తుల, సంఘాలవారు ప్రకటనలు చేశారో!

రచయితల అరెస్టు ఉద్యమానికి బల్నాయిచ్చింది. వీరి విడుదలకొరకే ఉద్యమం కాదు. వీరి విడుదల తరువాతా యీ ఉద్యమం ఆగదు. ఇది ప్రజల ఉద్యమం. ప్రభువులకోపాన్ని ఎదుర్కొంటూ ముందుకొస్తున్న ఉద్యమం.

SRJANA Telugu Monthly Nov. '73 H-1088
Regd. No. with Registrar of News Papers 10953/67

## ప్రస్తుతం సృజన దగ్గర అమ్మకానికి సిద్ధంగావున్న పుస్తకాలు:

| | | |
|---|---|---|
| 1. | వి. బి. గద్దర్ పాటలు    పాటలు | 0-50 |
| 2. | రక్తాశ్రువులు-డాక్టర్ నార్మన్ బెతూన్ అమరగాథ | 3-20 |
| 3. | మావో మిలిటరీ రచనలు - 2వ భాగము | 3-00 |
| 4. | కళలూ, సారస్వతం ఎవరికోసం? - మావో | 0-65 |
| 5. | ఆలోచించండి - మిత్రా వ్యాసాలు | 1-25 |
| 6. | నక్సల్బరి - కవితాసంపుటి | 1-50 |
| 7. | రేపటి కవిత్వం - విమర్శ | 0-75 |
| 8. | ఆగ్నేయాసియా అంతటా విప్లవ పోరాట జ్వాలలు రగులు కొంటున్నాయి | 0-30 |
| 9. | భారత-సోవియట్ ఒప్పందం | 0-30 |
| 10. | గమ్యం - చెరబండరాజు | 1-50 |
| 11. | జముకులకథ - పాణిగ్రాహి | 1-00 |
| 12. | విరసం మూడవ మహాసభల ప్రత్యేక సంచిక | 2-00 |
| 13. | రెక్కవిప్పిన రెవల్యూషన్ - ఏంజెలో కాబ్రోచ్చి | 2-00 |
| 14. | శ్రీకాకుళ సత్యం పాటలు - వెంపటాపు సత్యం | 1-00 |
| 15. | అ. ర. సం. కాయకల్ప చికిత్స??? - కె. వి. రమణారెడ్డి | 1-25 |
| 16. | మహోదయం బుర్రకథ - కానూరి వెంకటేశ్వరరావు | 1-00 |
| 17. | ఎర్రపిడికిలి - కె. వి. రమణారెడ్డి | 3-00 |
| 18. | నాకుటుంబం - నవల - టావ్ చెంగ్ | 2-00 |
| 19. | తెలంగాణ పోరాట పాటలు | 1-00 |
| 20. | జనసేన పాటలు    జనసేన | 1-00 |
| 21 | భారతీయ తత్వశాస్త్రం-ఒకపరిశీలన - నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు | 1-00 |
| 22. | కాళీపట్నం రామారావు కథలు | 2-50 |

SRJANA
HANAMKONDA
Warangal 506001

1 Re.